# TIRUMALA KSHETRA CHARITRA

By
**Dr. A. Vibheeshana Sarma**

T.T.D. Religious Publications Series No. 1375


First Edition : 2019

Copies : 500

Price :

Published by :
**Sri ANIL KUMAR SINGHAL,** I.A.S.
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 501

**D.T.P.**
Publications Division,
T.T.D, Tirupati

Printed at
**Tirumala Tirupati Devasthanam's Press**
Tirupati - 517 501

## ముందుమాట

**"వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన**
**వేంకటేశ సమో దేవో న భూతో న భవిష్యతి"**

వేంకటాద్రికి సమానమైన మరో క్షేత్రం ఈ బ్రహ్మాండంలోనే లేదు. వేంకటేశ్వరునికి సాటి రాగల దేవుడు ఇంతవరకు ఎక్కడా లేదు. ఇక మీదకూడ ఉండదు – అని అర్థం.

కలియుగ వైకుంఠంగా భాసిల్లే శ్రీ వేంకటాద్రిపై అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీవేంకటేశ్వరస్వామి అవతరించి నిత్యమూ భక్తులకు దర్శనమిస్తూ వారిని తరింపజేస్తున్నాడు. శ్రీవేంకటేశ్వరస్వామి దివ్యమంగళ విగ్రహమూర్తిని ఒక్క క్షణకాలమైనా దర్శించుకొని తరించడానికి వేలకొద్ది భక్తులు నిత్యమూ ఈ క్షేత్రానికి యాత్ర చేస్తుంటారు.

పిలిస్తే పలికే ప్రత్యక్షదైవమూ, కోరిన వరాలరాయడూ ఐన శ్రీ వేంకటేశ్వరస్వామి వెలసిన ఈ క్షేత్రంలోని స్వామి దివ్యమంగళ విగ్రహం, స్వామి పుష్కరిణి, పవిత్రతీర్థాలు, స్వామికి అతివైభవంగా జరిగే నిత్యకైంకర్యాలు, స్వామి బ్రహ్మోత్సవాలు మొదలైన విశేషాలు భక్తులకు తెలియజేయాలనే సంకల్పంతో తిరుమల తిరుపతి దేవస్థానం 'తిరుమల క్షేత్రదర్శిని' అనే పేర ఒక గ్రంథమాలను ప్రారంభించి, ఆ యా పండితులచేత గ్రంథాలను రాయించి ప్రకటించాలని తలపెట్టింది.

ఈ గ్రంథాలలో, ప్రస్తుతం **డా॥ ఆకెళ్ళ విభీషణ శర్మ** గారు రచించిన **'తిరుమల క్షేత్ర చరిత్ర'** అన్న ఈ గ్రంథాన్ని భక్తులకు అందజేస్తున్నాము. భక్తులీ గ్రంథంద్వారా స్వామివారి అవతార వైభవాన్ని తెలుసుకొని ధన్యత నొందుదురుగాక అని ఆకాంక్షిస్తున్నాము.

సదా శ్రీవారి సేవలో...

**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

## విషయసూచిక

# 1. వేంకటాద్రి

108 దివ్యక్షేత్రములలో 'తిరువేంగడమ్' ఒక పుణ్యక్షేత్రం. యీ శేషాద్రినే 'వేంగడమ్' అని వేంకట' అని పిలుస్తారు. అందుకే పర్వతాన్ని వేంకటాద్రి అని శ్రీవారిని 'శ్రీవేంకటేశ్వర' అని పిలుస్తారు. స్వామీ అందువల్ల నీవు వేంకటనాథుడవే వేంగళనాథుడవే అని భక్తుల విశ్వాసము. పర్వత శ్రేష్ఠములలో అత్యంత ప్రాచీనము, మహామహిమాన్వితమగు పర్వతము వేంకటాద్రి. ఇది శేషాచలమను పేరుతో భూలోకములో ప్రసిద్ధికెక్కినది. ఈ ఆదిశేషుడు శ్రీమహావిష్ణువునకు నిత్యసూరులైన అనంత, గరుడ, విష్వక్సేనాదులలో ఒకరు. శ్రీమహావిష్ణువునకు బాయని శయ్య. దీనిపై వసించినవాడు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపమగు నారాయణమూర్తియే గాని అన్యుడుకాడు. 'శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే' అని వేదాంతగ్రంథములందు కొనియాడబడెడి పరంబ్రహ్మమితడేయని వేరుగా చెప్పనక్కరలేదు. సాక్షాత్తు పరనామకమగు వైకుంఠమును వీడి తనకుతానుగా పతిత దీనోద్ధరణ సేవాసక్తతతో యీ ఆదివరాహ క్షేత్రమున ఆనందనిలయ విమానమున నెలకొనియున్నాడు. అన్నమయ్య తన కీర్తనలో వేంకటాద్రివిభుడు ఎలా నెలవైయున్నాడో చక్కగా వివరించాడు.

**నిత్యాత్ముడై యుండి**
**నిత్యుడై వెలుగొందు,**
**సత్యాత్ముడై యుండి,**
**సత్యమై తానుండు**
**ప్రత్యక్షమైయుండి,**
**బ్రహ్మమై యుండు**
**సంస్తుత్యుడీ తిరువేంకటాద్రి విభుడు.**

అని మధురముగా వేంకటేశ్వరుని తన కీర్తనలలో అభివర్ణించెను.

### శ్రీశైలం – శ్రీగిరి – తిరువేంగడమ్ – తిరుమల తిరుపతి

శ్రీరామానుజాచార్యులు వారు వేంకటాచలమునకు శ్రీశైలమని పేరు పెట్టారు. మల్లికార్జునుడు వుండు శైవక్షేత్రము శ్రీశైలమని అప్పటికే ప్రఖ్యాతి గాంచెను. అటు పిమ్మట శ్రీవేంకటాచలమును 'శ్రీగిరి' అన్నారు. శ్రీగిరి అంటే తిరుమల. అది ఎట్లనగా 'శ్రీ' అను పదమును తమిళంలో 'తిరు' అని పిలుస్తారు. 'గిరి' అనుపదమును తమిళములో 'మలై' అని పిలుస్తారు. కావున ఆనాటి నుండి తిరుమల అను వ్యవహారము ఏర్పడినది. మరియు 108 దివ్య క్షేత్రాలలో తిరువేంగడమ్ ఒక పరమ పుణ్యక్షేత్రమని ఆళ్వారులు వారు రచించిన పాశురములలో కూడా కీర్తించియున్నారు. 'వేంగడమును' తమిళములో 'మలై' యని కూడా వ్యవహరించెదరు. కావున తిరుమలై అనుపదమే 'తిరుమల' అని వ్యవహారములోనికి వచ్చినది.

ఈ కొండ తిరుమల కొండ అని పిలువబడుటచే శ్రీనివాసుడు తిరుమలేశుడయ్యాడు. స్వామి వారు వేంచేసి నందువల్ల ఈ పర్వత ఔన్నత్యానికి ఒక విలువ వచ్చింది, కొత్త అర్థమూ వచ్చింది. పదకవితా పితామహుడైన అన్నమాచార్యులు తిరుమల కొండను గూర్చి

**కొండ చూతము రారో, కొండొక తిరుమల కొండ**

**కొండనడిగిన వరములు ఒసగును, కొండల తిమ్మయ్య కొండ** అని కీర్తించారు.

శ్రీపతి నుంచి తిరుపతి అని మార్పు చెందింది. 'తిరు' అనగా 'శ్రీ', శ్రీకి 'పతి' అని అర్థము. లక్ష్మీ భర్త వేంకటేశ్వరుడు నివశించే ప్రదేశము కాబట్టి తిరుపతి అని పేరు వచ్చింది. తిరుపతి అంటే పరమ పవిత్రుడైన ప్రభువు లేదా ఆశ్రితులకు పవిత్రతను చేకూర్చేవాడు అని అర్థము. కావుననే తిరుమల తిరుపతి అను నామములతో ఈనాటికి వ్యవహరింపబడుచున్నది.



### నారదుడు శ్రీమన్నారాయణునికి విహార స్థలము సూచించుట

నారదుడు శ్రీమన్నారాయణునితో ప్రభూ! నీ విహారమునకు తగినదియు, సుందరమైనదియు, ఆశ్చర్యప్రదమైన స్థానము ఒకటి కలదు. భూలోకమున అట్టి స్థలమింకొకటి లేదు. నీపాదపద్మముల యందు పుట్టిన గంగకు దక్షిణ దిక్కున, దండకారణ్యమున – రెండు వందల యోజనముల దూరమున, దక్షిణ సముద్రమునకు ఉత్తర దిక్కున, పూర్వ సముద్రమునకు పడమటి దిక్కున – అయిదు యోజనముల దూరమున అందమగు స్థలము కలదు. అది నీకు విహార స్థానమై యున్నది. అచ్చటి జనులందరు తపస్సు, వేదాధ్యయనమున ఆసక్తిలేక మానసిక దేహవ్యాధులు కలిగి దిక్కుతోచక నివసించుచున్నారు.

నీవు వారిని అనుగ్రహించుటకై విచ్చేసి ఉండవలెనని ప్రార్థించగా, అంతట శ్రీమన్నారాయణుడు, కలియుగమున చోళరాజునకు 'చక్రవర్తి' అను కుమారుడు కలుగును. అతడు నాకు ప్రియభక్తుడు. తనని అనుగ్రహించుటకై నేనచ్చటకు విచ్చేస్తానని పలికెను. అని బ్రహ్మాండపురాణము ద్వారా తెలియుచున్నది.

### భగవంతునకు ఆదిశేషుడు క్రీడాపర్వతమగుట

ఒకనాడు శ్రీమన్నారాయణుడు ఆదిశేషుని పిలిచి ఆదిశేషా! నీకంటే ప్రియమైనవారు నాకు మరియొకరు లేరు. కావున నీవు నాకొక ప్రియమును చేకూర్చవలెను. నీవు భూలోకమునకేగి పర్వతరాజమై యుండుము.

నీ పడగలచే నేర్పడిన భూమిపై నేను శ్రీదేవితో విహరింతును. అని పలుకగా అంత ఆదిశేషుడు శ్రీవారితో స్వామీ! శేషుని రూపమున నేను పర్వత రూపమును ధరించియుందును. మీరు లక్ష్మీదేవితో నా చరియలందు క్రీడించగలరు. మీ ఆజ్ఞచే గంగాది నదులును, పుష్కరిణులను, సర్వకాలములయందు నాపై నుండునుగాక! నాపై పుట్టిన

చరాచరములన్నిటికిని మీ అనుగ్రహముచే నభీష్టములన్నియు సిద్ధించునుగాక! అని ప్రార్థించి, భూలోకమున పర్వత రాజమై వెలసెనని బ్రహ్మాండపురాణము ద్వారా తెలియుచున్నది.

**ఆనందాద్రియే వేంకటాద్రి**

వైకుంఠద్వారమున ఆదిశేషుడు-వాయువు కలహించుకొని, ఆదిశేషుడు శ్రీమన్నారాయణుని పిలువగా, శ్రీమన్నారాయణుడు ద్వారము వద్దకు రాగానే వాయువు శ్రీహరికి సాష్టాంగముగా నమస్కరించి స్తుతించెను. ఆదిశేషుడు నేనత్యంత బలశాలిని. నాతో సమానులు ముల్లోకములలో ఉండజాలదని పలుకగా, భగవానుడు మాటలతో మాత్రమే పౌరుషము చూపుటకన్న చేష్టలతో పౌరుషమును చూపుటయే సరియగు సమాధానమగును. దేవతలందరును మీ శౌర్యపరాక్రమముల పరీక్షింతురుగాక! అని పలికి, అదిశేషా! ఉత్తర దిక్కున మేరుపుత్రుడగు అనందాద్రి కలదు. నీ బలమంతా ఉపయోగించి ఆ పర్వతమును బంధించి కదలక నిలిపియుంచమని ఆజ్ఞాపించెను. పిమ్మట వాయుదేవుని నీవు వెళ్ళి శేషునిచే బంధింపబడియున్న పర్వతమును కదిలింపమని ఆజ్ఞాపించెను. శ్రీహరి ఆజ్ఞచే దేవతలందరు చూచుచుండగా, వాయువు బలగర్వితుడై ఆపర్వతమును కదలింపవలెనని ప్రయత్నించాడు. కాని ఆదిశేషునిచే చుట్టబడి యుండుటచే కొంచెమైనను పర్వతము కదలకుండెను. మరల అధికవేగముతో విజృంభించెను. ఆదిశేషుడు భగవంతుని సంకల్పము తెలిసికొని పడగను వదులుగా చేసెను. వాయువు తాకినంతనే ఆదిశేషునితో గూడ ఆ పర్వతము దక్షిణదిశగా లక్షలయోజనముల దూరమునకు ఎగిరిపోయెను. మేరువు తన పుత్రుణ్ణి రక్షించమని వాయువును వేడుకొనగా స్వర్ణముఖీనదికి ఉత్తరతీరమున ఆదిశేషునితోకూడిన పర్వతమును నిలిపెను. అంత దేవతలు వాయువుతో



**అయం శేషాంశతో వాయో! శైలః శైలాత్మజేశ్వరః**
**హరేః సంచోదనే నైవ త స్యావాసహేతవే**
**వ్యాజేనైవ త్వయా నీతః తేన స్వర్ణముఖీతటమ్**

మేరుపర్వతపుత్రుడగు ఆనందాద్రి ఆదిశేషుని అంశమున పుట్టినది. శ్రీమన్నారాయణుని ప్రేరణము చేత నివాసయోగ్యముగా కల్పింపబడినది. నీవు నిమిత్త మాత్రుడవేయని పలుకగా వాయువు గర్వము వీడి ఆదిశేషుణ్ని స్తుతించెను. శేషుని యంశమగుటచే ఈపర్వతమునకు శేషాచలమను ప్రసిద్ధనామము పొందెను.

ఈ విధముగా అదిశేష-వాయుసంవాదము వలన ఆదిశేషుని అంశమైన ఆనందాద్రి భూలోకమునకు తీసుకొనిరాబడినది.

**శేషుని ముఖమే వేంకటాద్రి**

**యోజనత్రయవిస్తీర్ణః త్రింశద్యోజన మాయతః,**
**వదనం వేంకటగిరిః నృసింహాద్రి శ్చ మధ్యమః**
**శ్రీశైలః పుచ్ఛభాగస్థః సర్వక్షేత్రమయో గిరిః**

మూడు యోజనముల వెడల్పు కలిగి, ముప్పది యోజనముల పొడవు కలిగి. వేంకటాచలము ముఖముగను, నృసింహపర్వతము నడుముగను, శ్రీశైలము వెనుక భాగముగా గలిగియున్నది. వేంకటాచలము పుణ్యక్షేత్రముగా విరాజిల్లుచున్నది మరియు బ్రహ్మాండ పురాణమున గూడ ఆదిశేషుని తలభాగము వేంకటాచలముగను, శేషుని వక్షఃస్థలము ఆహోబిలముగను, శేషుని పుచ్ఛభాగము శ్రీశైలమను పేర్లు ప్రసిద్ధికెక్కినదని తెలియుచున్నది.

**ఫణామణిప్రదేశం వేంకటాద్రి రితి స్మృతః**
**శేషాద్రిః వృషభాద్రి శ్చ నారాయణగిరి స్తథా**

శేషుని పడగలే క్రమమగా వేంకటాద్రి, శేషాద్రి, వృషభాద్రి, నారాయణగిరి అని పర్వతములుగా విలసిల్లుతున్నాయి.

**గరుత్మంతునకు శ్రియఃపతి ఆదేశము**

ఆదిశేష – వాయువులకు జరిగిన వాదములో ఆపర్వతము దక్షిణదిక్కునకు ఆదేశింపబడినది. అలా ఆదేశింపబడిన మేరుపర్వత పుత్రుడైన ఆనందాద్రి సువర్ణముఖీనదీ తీరమునకు ఉత్తరమున వచ్చిచేరెను.

**శిఖరం యస్య దృష్ట్వైవ సద్యః పాపైః ప్రముచ్యతే**

ఈ పర్వతరాజ శిఖరమును జూచినంతనే వెంటనే పాపములు నశించిపోవును. పరమ పవిత్రమైన శ్రీవేంకటాచలము నెత్తుకొని వైకుంఠమునకు గొనిపోయెదనని తలంచగా శ్రియఃపతి తెలిసికొని గరుడునితో, పక్షిరాజా! మనమందరము ఈ పర్వతము నందే నివసించెదము అని అనెను.

**త్వం గిరేర్దక్షిణం సానుం ఆసాద్య వస నిత్యతః,**
**శేషాఽఽగచ్ఛ వ సేహ త్వం తార్క్ష్యాథః శైలరూపధృక్**

**తావన్నిత్యం మమ ప్రీత్యై శైల మాశ్రిత్య సర్వతః**
**ఆకల్పాన్తం వసా మీహ జగత్పాలనకారణాత్**

నీవు పర్వత దక్షిణ చరియందెల్లప్పుడు నివసించియుండుము. శేషా! నీవు గరుత్మంతుని క్రిందుగా పర్వతరూపమును ధరించి నివసింపుము. నేను ప్రళయకాలము వరకు జగత్తును రక్షించుటకై యిచ్చట నివసించి యుందును. కావున మీరు నా సంతోషమునకై పర్వతము నాశ్రయించి యుండుము. అని ఆదిశేషుని, గరుత్మంతుని ఆజ్ఞాపించి శ్రీనివాసుడు శ్రీదేవితో దేవరాక్షసులచే నమస్కరింపబడుచు పుష్కరిణీ తీరమున విహరించుచుండెను.



**అన్నమయ్య సంకీర్తనలో శేషాచలమే – వేంకటాచలము**

హరివాసము శేషాచలము ఇది అపురూపము, ఆనందమయము, బ్రహ్మమయము అని అన్నమయ్య తన సంకీర్తనలో కీర్తించెను.

**అదివో అల్లదివో శ్రీహరివాసము**
**పదివేల శేషుల పడగల మయము**
**అదె వేంకటాచల మఖిలోన్నతము**
**అదివో బ్రహ్మాదుల కపురూపము**
**అదివో నిత్యనివాస మఖిల మునులకు**
**అదె చూడుడదె మొక్కుడానందమయము.**
**చెంగటనల్లదివో శేషాచలము**
**నింగినున్న దేవతల నిజవాసము**
**ముంగిట నల్లదివో మూలనున్నధనము**
**బంగారు శిఖరాల బహుబ్రహ్మమయము**
**కైవల్యపదము వేంకటనగమదివో**
**శ్రీవేంకటపతికి సిరులైనది**
**భావింప సకల సంపద రూపమదివో**
**పావనములకెల్ల పావనమయము.**

అని పద కవితా పితామహుడు తాళ్ళపాక అన్నమయ్య ఈ విధముగా హరివాసమును శేషాచలమని, వేంకటాచలమని కీర్తిస్తూ ఆ పర్వత మాహాత్మ్యమెట్టిదో చక్కగా అభివర్ణించెను.

**పురాణములలో – వేంకటాద్రి**

**బ్రహ్మపురాణములో – వేంకటాద్రి నామము**

**మేరోః పుత్రో మహాశైలో జాంబూనదనదీతటే**
**యోజనత్రయవిస్తీర్ణః త్రింశద్యోజన మాయతః**

**వేంకటేతి కృతం నామ పిత్రా యస్య మహాత్మనః**
**అమృతస్యేందిరాయా శ్చ యతో విస్తారకారకః**

సువర్ణముఖీ నది ఒడ్డున మూడు యోజనముల విస్తీర్ణము ముప్పై యోజనముల పొడవుగల పర్వత మొక్కటి కలదు. అదియే మేరు పర్వతము యొక్క భాగము (పుత్రుడు). పర్వత రాజగు మేరువుచే తన పుత్రునకు 'వేంకట' అని నామకరణము చేయబడెను.

వేంకట శబ్దమునకు ఇహపరములలో అమృతమును, ఐశ్వర్యమును నిచ్చువాడని యర్థము.

**భవిష్యోత్తరపురాణములో – వేంకటాద్రి నామము**

ఈ పర్వతమునకు వేంకటాచలమను నామము. వేం అనగా పాపములు, కటః అనగా దహింపజేయు అని అర్థము. మాధవుడనే బ్రాహ్మణుడు వేంకటాద్రిని అధిష్ఠించగానే తన పాపములన్నీ సమసిపోయి పవిత్రుడు కావడముతో బ్రహ్మ ప్రత్యక్షమై ఓమాధవా! నీవు మరుజన్మలో ఆకాశరాజుగా జన్మించి కీర్తిప్రతిష్ఠలను పొందెదవు అని అనుగ్రహించెనని బ్రహ్మాండపురాణము ద్వారా తెలియుచున్నది.

**తదా నామ చకారాద్రే: వేంకటాచల ఇత్యపి**
**సర్వపాపాని 'వేం' ప్రాహుః కటః తద్దాహ ఉచ్యతే**

**తస్మాద్వేంకట శైలోఽయం లోకే విఖ్యాతకీర్తిమాన్**
**ప్రభాతకాలే రాజేన్ద్ర యః కీర్తయతి భూధరమ్**

**తస్య పుణ్యఫలం వక్ష్యే శ్రుణు రాజన్ యథాస్థితమ్**
**ఫలం భవేద్ధ్రువం గంగాసేతుయాత్రాసహస్రమ్**

ప్రాతఃకాలమున మేల్కొనిన వెంటనే ఈ పర్వతనామము స్మరించు వానికి గంగాదిసేతు స్నానములు వేలకొలది సార్లు ఆచరించిన కలుగు ఫలితమును పొందగలరని తెలిపెను.



వరాహ, వామన పురాణములలో – వేంకటాద్రినామము

వరాహ, వామన పురాణములలో వేంకటాద్రి నామమును గూర్చి ఒక శ్లోకము వర్ణించబడినది.

**వేంకారో ఽమృతబీజం తు కటమైశ్వర్య ముచ్యతే,**
**అమృతైశ్వర్యసంఘత్వాత్ వేంకటాద్రి రితి స్మృతః**

వేం కారం అమృతమని, కట శబ్దం ఐశ్వర్యమని చెబుతున్నాయి. ఈ పర్వతము ఆశ్రితులకు అమృతమును, ఐశ్వర్యమును అనుగ్రహిస్తున్నది గనుక వేంకటాద్రిగా ప్రసిద్ధిచెందింది.

**బ్రహ్మాండపురాణములో – వేంకటాద్రి నామము**

బ్రహ్మాండపురాణమున కూడ మాధవుని పాపములన్నియు నశింపచేయబడినవిగాన ఈ పర్వతమునకు వేంకటాచలమను నామము. పాపములన్నిటికిని వేం అని పేరు. కటమనగా దహింపజేయుట సకల పాపములను దహింపజేసినది గాన దీనికి వేంకటాచలమను పేరు ప్రఖ్యాతి గాంచినది.

**సర్వపాపాని వేం ప్రాహుః కటస్తద్దాహ ఉచ్యతే,**
**సర్వపాపదహో యస్మాత్ వేంకటాచల ఇత్యభూత్**

**వేంకటాద్రి నామములు**

**క్షేత్రాణాం క్షేత్రముత్కృష్టం తీర్థానాం తీర్థముత్తమమ్**
**శ్రీవేంకటగిరిర్నామ క్షేత్రం పుణ్యం మహీతలే**
**సర్వపాపప్రశమనం సర్వపుణ్యవివర్ధనమ్**
**ఆరాధ్య స్సర్వదేవానాం మాధవో భక్తవత్సలః**
**విహాయ స్వం పరంధామ రమతే రమయా సహ**

క్షేత్రములకెల్లను, తీర్థములకెల్లను గొప్పది వేంకటాద్రి. ఈ క్షేత్రము సర్వపాపములను శమింపజేసి పుణ్యములను కలుగజేయును. సర్వలోకేశ్వరుడగు శ్రియఃపతి శ్రీవైకుంఠ నివాసమును వదలి మహాలక్ష్మితో కూడి యీ క్షేత్రమున సాన్నిధ్యము చెందియున్నాడు. ఈ వేంకటాద్రి ఒక్కొక్క యుగమున ఒక్కొక్క పేరుతో పిలువబడుతుంది.

**కృతే వృషాద్రిం వక్ష్యన్తి త్రేతాయాం అంజనాచలమ్**
**ద్వాపరే శేషశైలేతి కలౌ శ్రీవేంకటాచలమ్**

ఈపర్వతమును కృతయుగమున వృషాద్రి అనియు, త్రేతాయుగమున అంజనాచలమనియు, ద్వాపరయుగమున శేషాద్రి అనియు, కలియుగమున శ్రీవేంకటాచలమనియు యుగధర్మముల మార్పునననుసరించి వ్యవహరింతురని కొన్ని పురాణములయందు చెప్పబడినది. ప్రత్యేకించి వామన పురాణమునందు త్రేతాయుగమున గరుడాచలమని పిలువబడుతుందని చెప్పబడినది.

**కృతే వృషాద్రిం వక్ష్యన్తి త్రేతాయాం గరుడాచలమ్**
**ద్వాపరే శేషశైలం చ వేంకటాద్రిం కలౌయుగే**

**గిరీశస్య స జామాతా గిరీశాఖ్యః కిమద్భుతమ్**
**సప్తాద్రీశస్త్వమేవాసి గిరీశః శేషనాయకః**

సప్తాద్రి అనగా 1. శేషాద్రి, 2 గరుడాద్రి, 3. నారాయణాద్రి, 4. వృషభాద్రి. 5. వృషాద్రి, 6. అంజనాద్రి, 7. వేంకటాద్రి. అందుకే స్వామివారి ఏడుకొండల వాడని, సప్తాద్రీశుడని పిలుస్తారు.

శ్రీవేంకటేశ్వర సుప్రభాతమునందు ఏడుకొండలు వర్ణించబడినది.

**శ్రీశేషశైల గరుడాచల వేంకటాద్రి**
**నారాయణాద్రి వృషభాద్రి వృషాద్రిముఖ్యామ్**



**ఆఖ్యాం త్వదీయవసతే రనిశం వదంతి**
**శ్రీవేంకటాచలపతే తవ సుప్రభాతమ్**

ఓ వేంకటాచలపతీ నీ నివాసమగు ఈ తిరుమల కొండను. శ్రీశైలము, శేషశైలము, గరుడాద్రి, వేంకటాద్రి, నారాయణాద్రి, వృషభాద్రి, వృషాద్రి అని ఏడుకొండలుగా అభివర్ణించబడినది.

వేంకటాద్రి ఇరవై (20) పేర్లతో పిలువబడుతున్నదని బ్రహ్మాండ పురాణమున ఈ శ్లోకప్రమాణము ద్వారా తెలియుచున్నది.

**అంజనాద్రిః వృషాద్రి శ్చ శేషాద్రిః గరుడాచలః**
**తీర్థాద్రిః శ్రీనివాసాద్రిః చింతామణిగిరి స్తథా**

**వృషభాద్రిః వరాహాద్రిః జ్ఞానాద్రిః కనకాచలః**
**అనందాద్రి శ్చ నీలాద్రిః సుమేరుశిఖరాచలః**

**వైకుంఠాద్రిః పుష్కరాద్రిః ఇతి నామాని వింశతిః**
**తన్నామాని పఠేయు ర్యే ముచ్యన్తే తే ఉఘబన్ధనాత్**

అంజనాద్రి, వృషాద్రి, శేషాద్రి, గరుడాద్రి, తీర్థాద్రి, శ్రీనివాసాద్రి, చింతామణిగిరి, వృషభాద్రి, వరాహాద్రి, జ్ఞానాద్రి, కనకాచలము, ఆనందాద్రి, నీలాద్రి, సుమేరు, శిఖరాచలము, వైకుంఠాద్రి, పుష్కరాద్రి, వేంకటాద్రి, నారాయణగిరి, తిరుమలై, సింహాచలము అను యిరువది (20) పేర్లతో పిలువబడే ఈ పర్వతాన్ని ఎవరు ఆరాధించినా, ఇందు వెలసిన శ్రీస్వామిని ఎవరు సేవించినా కృతకృత్యులౌతారు.

క్రీడాద్రికి కారణ భేదముచే అనేకములైన పేర్లు వచ్చినట్లు వరాహపురాణము ద్వారా కూడా తెలియజేస్తున్నది. అవి క్రమముగా చింతామణి, జ్ఞానాద్రి, తీర్థాద్రి, పుష్కరాద్రి, వృషాద్రి, కనకాద్రి, నారాయణాద్రి, వైకుంఠాద్రి, సింహాచలము, అంజనాద్రి, వరాహాద్రి, నీలగిరి,

వేంకటాద్రి, శ్రీనివాసగిరి, ఆనందాద్రి, శ్రీశైలమని ఇట్లు కల్పముల భేదముచేత నితరములగు నామములెన్నియో కలవు.

**1. అంజనాద్రి**

**అంజనా వ్రత మాస్థాయ, పుత్రం ప్రాప గిరీశ్వరే !**
**తస్మాదంజనశైలోఽయం లోకే విఖ్యాతకీర్తిమాన్ ॥ (భవిష్యోత్తర.1.81)**

అంజనాదేవి వ్రతాన్ని ఆచరించి పుత్రుడును పొందిన పర్వతం గనుక 'అంజనాద్రి'గా లోకంలో విఖ్యాతి పొందింది.

**2. వృషాద్రి**

**గిరా వస్మిన్ స్తప స్తేపే ధర్మోఽపి స్వాభివృద్ధయే**
**తస్మా దాహ వృషాద్రిం తం మునయో వేదపారగాః**

ఓ ధర్మదేవతా! నీకు ఎప్పుడు కష్టంకలుగుతుందో అప్పుడు నేను అవతరించి నిన్ను కాపాడుతానని వరాన్ని ప్రసాదించాడు. ధర్మదేవత తపమాచరించిన ఆ పర్వతమును 'వృషాద్రి'గా పిలువబడెను.

**3. శేషాద్రి**

**యోజనత్రయవిస్తారం త్రింశద్యోజనమాయతమ్**
**శేషాకారం హరే శ్శైషం, శేషికా సర్వదేవానామ్**

మూడు యోజనములు విస్తారము, ముప్పై యోజనములు పొడుగు కలిగి శేషాకృతితో ఈ గిరి విరాజిల్లుతున్నది. కనుక ఇది శేషాద్రిగా ప్రసిద్ధి చెందినది.

**4. గరుడాద్రి**

**ఆగతం గరుడం వీక్ష్య స్థాప యేహ ఖగేశ్వర**
**ఇత్యువాచ హరి స్సోఽపి స్థాపయామాస తం తథా**



శ్రీవైకుంఠం నుండి గరుడుడు ఈ పర్వతాన్ని తీసుకురావడం వల్ల ఈ గిరికి గరుడాద్రి అని ప్రసిద్ధి వచ్చింది.

**5. తీర్థాద్రి**

**సర్వతీర్థమయత్వా చ్చ తీర్థాద్రిం ప్రాహు రుత్తమాః (వరా.36.21)**

సర్వ తీర్థమయమగుటచే తీర్థాద్రి యనుపేరు కల్గియున్నది.

**6. శ్రీనివాసాద్రి**

**యతః కదాచి ద్దేవానాం శ్రీనివాస ఇహ బభౌ**
**శ్రీనివాసగిరిం ప్రాహు స్తస్మా దేనం దివౌకసః**

ఒకానొక సమయాన దేవతలకి శ్రీనివాసుడు ఇక్కడ ప్రత్యక్షమైయ్యాడు. అందువల్ల దేవతలు ఈ కొండను శ్రీనివాసగిరి అని పిలిచారు.

**7. చింతామణిగిరి**

త్రేతాయుగమున దశరథుడు స్వామి పుష్కరిణిలో స్నానమాచరించి శ్రీహరిని 4 శ్లోకాలతో స్తుతించగా అంతట శ్రీహరి స్తుతికి సంతసించి నలుగురు కుమారులు కలిగేటట్లు వరాన్ని అనుగ్రహించాడు. అందుకే

**చిన్తితస్య చ సిద్ధ్యా తు చింతామణి మిమం విదుః (వరా.36.20)**

చింతించిన దానినంతను ఇచ్చుటచే 'చింతామణిగిరి పిలువబడుచున్నది.

**8. వృషభాద్రి**

వృషభాసురుని తపస్సుకు సంతసించి శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షం కాగా అంతట వృషభాసురుడు స్వామివారితో

**కేశవానన్త! గోవింద! శ్రీనివాస! సురోత్తమ!**
**న చ మోక్షం న చ స్వర్గం పారమేష్ఠ్యపదం హరే**

**న యాచే జగతాం నాథ! యుద్ధభిక్షాం చ దేహి మే**
**దశావతారవిభవే శ్రుత స్తే విక్రమో హరే**

కేశవా! అనంతా! గోవిందా! శ్రీనివాసా! దేవాదిదేవా! నేను మోక్షమును, స్వర్గమును, బ్రహ్మలోకము అభిలషింపను. నాకు యుద్ధము ప్రసాదించుము. నీ పరాక్రమమును దశావతార వైభవమున వింటిని అని పలుకగా శ్రీమన్నారాయణుడు వృషభాసురునితో యుద్ధంచేసి, విశ్వరూపం ధరింపజేసి చక్రాయుధముతో సంహరింతునని పలుకగా, అంతట ఆ రాక్షసుడు స్వామీ! నీ చక్ర మాహాత్మ్యము నిదివరలో వినియుంటిని. ఈ చక్రముచే సంహరింపబడిన నేనును మోక్షమును అలంకరింతును అని పలికి శ్రీవారి పాదములను స్పృశించి

**వరం యయాచే వృషభః శైలో మదభిదో స్త్వితి (భవిష్యోత్తర.1.64)**

ప్రభూ! ఈ పర్వతము నా పేరున పిలువబడుగాక! అని ప్రార్థించెను. కావున ఈ పర్వతము కృతయుగమున వృషభాద్రి యను నామముతో వ్యవహరింపబడెను. వరాహపురాణంలో శ్రీవారు వేటగాడు రూపమున వృషభాసురుని సంహరించెను.

**9. వరాహాద్రి**

భూమిని ఉద్ధరించదలచి శ్రీహరి వరాహావతారమున సముద్రంలోనున్న హిరణ్యాక్షుని సంహరించి భూమిని ఉద్ధరించాడు. శ్రేష్ఠమైన పర్వతము నందే ఉండదలచి గరుత్మంతుని పిలిపించి లోకానుగ్రహకాంక్షతో క్రీడాద్రిని భూమికి తెప్పించాడు. యజ్ఞవరాహమూర్తి భూదేవిని ఒడిలో ఉంచుకొని క్రీడాద్రిపై నెలవైయున్నాడు.

**వరాహాద్రిం వరాహక్షేత్రలక్ష్మతః (వరా. 37-29)**

నాటి నుండి వరాహక్షేత్ర మవ్వడంవల్ల, ఈ క్రీడాద్రి వరాహాద్రిగా కొనియాడబడుతున్నది.



**10. జ్ఞానాద్రి**

సనకసనందనాదులచే జ్ఞానయోగులకు, వశిష్ఠాది సప్తర్షులకు, దిక్పాలకులకు, బ్రహ్మాది సకలదేవతలకు జ్ఞానమయ ఉపాసనకు నిలయమైన క్షేత్రం కనుక జ్ఞానాద్రిగా పేర్కొనబడినది.

**11. కనకాద్రి**

**శాతకుంభస్వరూపత్వాత్ కనకాద్రిం చ తం విదుః**

స్వరూపమైనదిగావున దీనిని కనకాద్రిగా కీర్తిస్తున్నారు.

**12. ఆనందాద్రి**

**ఆనందాద్రి మిమం ప్రాహుః వైకుంఠపురవాసినః**
**ప్రాహుః భగవతః క్రీడాప్రాచుర్యా త్తు తథా సురాః**

శ్రీనివాసుడు వెలసిన పర్వతంపై ఋషులు తపమాచరించి ఆనందమే బ్రహ్మస్వరూపంగా తెలుసుకొంటున్నారు. అందువల్ల ఈ పర్వతం ఆనందాద్రిగా పిలువబడుతున్నది.

**13. నీలగిరి**

**నీలస్య వానరేంద్రస్య యస్మా న్నిత్య మవస్థితిః**
**తస్మా న్నీలగిరిం నామ్నా వదన్త్యేనం మహర్షయః**

నీలుడనే వానరుడు ఈ కొండపైన నివసిస్తూ తపమాచరించాడు. నీలుడు చరితార్థుడైన ఈ గిరి ప్రదేశం నీలగిరిగా ప్రసిద్ధి చెందింది.

**14. సుమేరు శిఖరాచలం**

శేషాద్రికే సుమేరు శిఖరాచలం అని పేరు. మేరు పర్వత శిఖరాలు ఎలా బంగారు కాంతితో ప్రకాశిస్తాయో అలా ఈ పర్వతము సత్త్వగుణసంపన్నులకు గోచరిస్తుంది.

**15. వైకుంఠాద్రి**

**వైకుంఠా దాగతత్వేన వైకుంఠాద్రి రితి స్మృతః (వరా.37.26)**

గరుత్మంతుడు క్రీడాద్రిని వైకుంఠం నుండి తీసుకువచ్చారు. అందువల్ల వైకుంఠాద్రి అని పేరు వచ్చింది.

**16. పుష్కరాద్రి**

**పుష్కరాణాం చ బాహుళ్యాత్ గిరా వస్మిన్ సరస్సు వై**
**పుష్కరాద్రిం ప్రశంసన్తి మునయ స్తత్త్వదర్శినః**

ఈ పర్వతములో పుణ్యపుష్కరిణులు విశేషముగా ఉండుటవలన మునులు, తత్త్వజ్ఞులు ఈ గిరిని పుష్కరాద్రి అని ప్రశంసించుచున్నారు.

**17. వేంకటాద్రి**

**వేంకారో అమృతబీజం తు కట మైశ్వర్య ముచ్యతే**
**అమృతైశ్వర్యసంఘత్వాత్ వేంకటాద్రి రితి స్మృతః**

వేంకారం అమృతమని, 'కట' శబ్దం ఐశ్వర్యమని చెబుతున్నాయి. అమృత ఐశ్వర్యముల సంఘటమగుటచే ఈ గిరికి వేంకటాద్రి అని పేరు.

**18. నారాయణాద్రి**

**ద్విజో నారాయణః కశ్చి త్తపః కృత్వా మహత్పురా**
**ఐచ్ఛదస్య స్వనామ్నా చ వ్యపదేశం మురారితః**
**తస్మా న్నారాయణాద్రిం తం విదు రుత్తమపూరుషాః(వరా.36.24,25)**

నారాయణుడను బ్రాహ్మణుడు పూర్వము ఈ గిరిపై తపస్సుచేసి ఈపర్వతము తన పేరున వెలయవలయునని విష్ణుమూర్తిని కోరెను. అందుచే దీనికి నారాయణాద్రి యను నామము కల్గిను.

**19. శ్రీశైలం**

**శ్రీప్రదత్వాత్ క్రియో వాసాత్, శబ్దశక్త్యా చ యోగతః**
**రూఢ్యా శ్రీశైలం ఇత్యేవం నామచాస్య గిరే రభూత్**



శ్రీపద యుక్తమగుట యుక్తమగుటచేతను, శ్రీనివాసమగుట చేతను దీనికి శ్రీశైలమను నామము కల్గినది.

**20. సింహాచలము**

**హిరణ్యాఖ్యవినాశాయ ప్రహ్లాదానుగ్రహాయ చ**
**నరసింహాకృతి ర్యజ్ఞే యస్మా దస్మా త్స్వయం హరిః**
**సింహాచల ఇతి ప్రాహుః తస్మా దేనం మునీశ్వరాః**

హిరణ్యకశిపుని శిక్షించుటకు, ప్రహ్లాదుని రక్షించుటకు నారసింహాకృతితో ఈ పర్వతమునుండే బయలుదేరాడు గనుక మునీశ్వరులు ఈ కొండను సింహాచలంగా అభివర్ణిస్తున్నారు.

* * *

## 2. పురాణములలో - వేంకటాచల మాహాత్మ్యము

### బ్రహ్మోత్తర ఖండపురాణములో – వేంకటాచల మాహాత్మ్యము

**కాశ్యాః దక్షిణదేశే వై కశ్చిదస్తి మహీధరః**
**వేంకటాద్రి రితి ఖ్యాతో విశ్వలోకైకసమ్మతః**

**శ్రీవేంక టేతి యన్నామ మర్త్యో వాచా వదన్నపి**
**దేవానాం వందనీయత్వం యాతి తాదృక్ మహీధరః (50.32,33)**

కాశీకి దక్షిణమున ప్రపంచప్రఖ్యాతి చెందిన వేంకటాద్రి యను పర్వతమొకటి కలదు. పేరు నుచ్చరించిన మాత్రముననే పవిత్రతను చేకూర్చు మాహాత్మ్యము ఆ పర్వతమునకు కలదు. ఆ పర్వతమున అరువదియారు కోట్ల తీర్థములు కలవు. ఆ తీర్థములన్నియు అన్ని పాపములను నశింపజేయును.

**కలౌ తు భారతే వర్షే మానుషం జన్మ దుర్లభమ్**
**తతో వేంకటయాత్రా తు దుర్లభా సుకృతం వినా**

కలియుగమున భరతవర్షమున మనుష్య జన్మదుర్లభము, అందును వేంకటాచల యాత్ర మిక్కిలి దుర్లభము.

### భవిష్యోత్తర పురాణములో – వేంకటాచల మాహాత్మ్యము

**కాలక్షేపార్థ ముత్సాహే కర్మణాబన్ధనం న హి**
**చిరన్తనేషు క్షేత్రేషు ముక్తిపాత్ర ముదాహృతమ్**

ఈ పర్వతమున కర్మలు కాలక్షేపము కొరకు ఆచరించినను వేడుకకై చేసినను అవి బంధహేతువులు కానేరవు. ప్రాచీనక్షేత్రములలోనిది మోక్షము నొసంగునదిగా చెప్పబడినది.

**యావద్వేంకటనాయకస్య శిఖరప్రాప్తి ర్న వై యోగినామ్**
**తావజ్జన్మజరాదిదుఃఖనిలయః సంసారకోలాహలః**



**బ్రహ్మాండాంతపరిభ్రమత్కృతమహాపుణ్యౌఘచంద్రోదయే**
**సత్సంగామృతసేవనాత్ హరిమయే ప్రీతి ర్భవేత్ వేంకటే**

శ్రీవేంకటేశ్వరస్వామికి నివాసమైన వేంకటాచలక్షేత్రం సేవింపనంతవరకు ఎంత మహాయోగులైన వారి జన్మ సఫలం కాదు. పుణ్యరాశి పరిపక్వమైనప్పుడే ఈ దివ్యక్షేత్ర సేవాభాగ్యం కలుగుతుంది. భవిష్యోత్తరపురాణములో రహస్యాధ్యాయమున కూడా వరాహస్వామికి, శ్రీనివాసునికి వేంకటాచలమే వైకుంఠమని చెప్పబడినది.

**వైకుంఠేన సహాగతం పర మిదం శ్రీవేంకటాద్రిస్థలమ్ ।**
**పూర్వం జ్ఞానవరాహమూర్తి హరిణా భూమ్యా సహాధిష్ఠితమ్ ।**
**లక్ష్మ్యా ఆలింగిత రూపమద్య సగుణం కల్యాణమాస్తే దధత్ ॥**

శ్రేష్ఠమగు శ్రీవేంకటాచలము వైకుంఠముతో సహా భూలోకమునకు వచ్చినది.

**వైకుంఠస్థాన శేషాద్రి ప్రాప్తిరూపం మహత్ఫలమ్**
**అహం గోప్య మిదం వేద్మి శుకో వేత్తి న చాపరః**

రెండవ వైకుంఠమనదగు శేషాచలమును పొందగలుగుట యను గొప్ప ఫలము మీకు కైవసమైనదని నేనే దీనిని అతిరహస్యముగా తెలుసుకున్నాను. శుకయోగీంద్రుడు తప్ప అన్యులు ఈ రహస్యము నెఱుంగరని సూతుల వారు శౌనకాదిమునులకు తెలియజేసిరి.

**అరాయికాణే వికటే గిరిం గచ్ఛ సదాన్వే**
**శిరంభిరస్య సత్వభిస్తే భిష్ట్వా చాతయామసి**

వేంకటగిరికి వెళ్ళి శ్రీనివాసుని దర్శించి, ప్రార్థించి నీ కోరికలు నెరవేర్చుకొనుము అని భావము. ఇదే విషయము భవిష్యోత్తర పురాణములో చెప్పబడినది.

**అరాయికాణే వికలే గిరిం గచ్ఛేతి తం విదుః**
**ఏవం వేదమయః సాక్షాత్ గిరీశః పన్నగాచలః**

మనుష్య జన్మ లభించినందుకు సార్థకతగా వేంకటాచలమునకు పోయి వేదమయుడైన ఆ స్వామిని దర్శించి, పూజించి, ప్రణమిల్లి తరింపవలయునని బోధించుచున్నవి.

**వరాహపురాణములో – వేంకటాచల మాహాత్మ్యం**

**అయం భగవతో హృద్యః పర్వతః పుణ్యకాననః**
**మంత్రసిద్ధి స్తపస్సిద్ధి ర్యజ్ఞసిద్ధి స్తథైవ హి**

**కామ్యస్య కర్మణ స్సిద్ధి రేవ మన్యా శ్చ సిద్ధయః**
**భవన్త్యత్ర నరాణాం చ నహి విఘ్నాదికం క్వచిత్**

**అల్పేన తపసాఽభీష్టం సిద్ధ్యత్యస్మిన్ గిరౌ వరే**

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడైన శ్రీవేంకటేశ్వర స్వామికి ప్రీతికరమైన ఈ కొండ ఎంతో మనోజ్ఞంగా ఉంటుంది. ఈ కొండపై మంత్రసిద్ధి, తపస్సిద్ధి, యజ్ఞసిద్ధి శీఘ్రంగా కలుగుతుంది. ఈ పర్వతం ఎన్నో దివ్యసిద్ధులకు నిలయం. ఇక్కడ ఏ కొంచెం తపస్సు చేసినా అనంతమైన ఫలం లభిస్తుంది.

**వైకుంఠాత్పరమో హ్యేష వేంకటాఖ్యో నగోత్తమః**
**అత్రైవ నివసామ్యేవ శ్రీభూమి సహితోహ్యహమ్**

శ్వేత వరాహరూపియగు భగవంతుడు హిరణ్యాక్ష వధనొనర్చి ధరణిని పాతాళమునుండి ఉద్ధరించి లోకమునను గ్రహించుటకు కొంతకాలం భూమిపై నివసించగోరినవాడై వైకుంఠమునుండి గరుడుని ద్వారా క్రీడాద్రిని భూమికి తెప్పించెను. దానికే వేంకటాద్రి అని వేంకటాద్రియే శేషాద్రి అని వరాహ పురాణము ద్వారా కూడా తెలియచున్నది.



**శేషాకారం హరే శ్శేషం శేషిణం సర్వదేహినామ్**

ఈ వేంకటాద్రి శేషాకృతితో నున్నట్లు పైశ్లోకము ద్వారా తెలియుచున్నది.

**వామనపురాణములో – వేంకటాచల మాహాత్మ్యము**

**అన్నదానం ప్రశస్తం హి దానానాం దాన ముత్తమమ్**
**నిత్య మస్మి న్నివసతాం అన్నపానాదిక న్తు యః**

**ప్రయచ్ఛేత్ స ఇహైవాశు సర్వరోగై ర్విముచ్యతే (43-7,8)**

దానములలోకెల్ల నుత్తమ దానము అన్నదానము శ్రేష్ఠమైనది. ఈ వేంకటాద్రి యందు అన్నదానము వలన సకలరోగముల నుండి విముక్తులగుదురు.

**వృషభాచలభూభాగే ఘటికా మపి యో వశేత్ ।**
**సప్తజన్మకృతం పాపం తత్క్షణా దేవ నశ్యతి ॥ (42-27)**

పరమపవిత్రమైన ఈ క్షేత్రమునందు ఒక్క గడియ సేపు నివసించినను ఏడు జన్మలలో చేసిన పాపము నశించును. (గడియ= 24 నిమిషములు)

**మార్కండేయ పురాణములో – వేంకటాచల మాహాత్మ్యము**

**శ్రీవేంకటాచలో నామ పుణ్యక్షేత్రం మహీతలే**
**శేషాద్రిః వృషశైలశ్చ గరుడాచల ఇత్యపి**

**పుణ్యాని సన్తి నామాని పునరన్యాని కానిచిత్**
**వైకుంఠలోకాత్ గరుడేన విష్ణోః క్రీడాచలో వేంకటనామధేయః**

**ఆనీయ చ స్వర్ణముఖీసమీపే సంస్థాపితో విష్ణునివాసహేతోః**
**తత్రాచలే వసన్ విష్ణుః కమలాలయ యా సహా ।**
**ఆనన్దనిలయే చైవ వర్తతే లోకరక్షకః ॥ (2-64-68)**

భూలోకమున శ్రీవేంకటాచలమను పుణ్యక్షేత్రము కలదు. దానికి శేషాద్రి, వృషాద్రి, గరుడాచలమని పవిత్ర నామములెన్నో గలవు.

శ్రీమన్నారాయణుని క్రీడాచలమును గరుత్మంతుడు తెచ్చి స్వర్ణముఖీనదీ తీరమున నుంచెను. ఆ పర్వతమున ఆనందనిలయమున శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవితో గూడి నివసించుచూ లోకములను రక్షించుచున్నాడు.

**గరుడపురాణములో - వేంకటాచలమాహాత్మ్యము**

సువర్ణముఖరీనదీ తీరంలో వేంకటాచలం' అనే పర్వతం విరాజిల్లుతూ ఉంది.

**అతిప్రీతి ర్మహావిష్ణోః తత్ర వేంకటభూధరే**
**శ్వేతద్వీపా చ్చ వైకుంఠాత్ భానుమండలమధ్యతః**

**యన్నామ కీర్తయిత్వాఽపి సర్వపాపక్షయో భవేత్**
**సమస్తశ్రేయసాం సిద్ధిః తాదృశో వేంకటాచలః**

**యస్మై వేంకటశైలాయ నమస్కృత్వాపి దూరతః**
**సర్వపాపైః ప్రముచ్యేత తత్పుణ్యం క్షేత్ర ముత్తమమ్ (63-13,14)**

కలియుగ ప్రత్యక్షదైవమైన వేంకటేశ్వరుడు ఆ కొండపై వెలసియున్నాడు. శ్వేతద్వీపం కంటె, వైకుంఠంకంటే, సూర్యమండల వాసం కంటే శ్రీమన్నారాయణుడు ఈ కొండపై ఉండటానికే ఇష్టపడతాడు. శ్రీ వేంకటాచలం అనే నామాన్ని ఒక్కసారి ఉచ్చరించినా చాలు, సకలపాపాలు నశిస్తాయి. సమస్త మంగళాలు సిద్ధిస్తాయి. దూరంనుంచే శ్రీవేంకటాచలానికి నమస్కరించినా సర్వాభీష్టాలు నెరవేరుతాయి.

**స్కాందపురాణములో - వేంకటాచల మాహాత్మ్యము**

**వైకుంఠలోకా దానీతో విష్ణోః క్రీడాచలో మహాన్**
**గరుత్మతా వేగవతా స్వర్ణముఖ్యా స్తటే శుభే**



**వర్తతే దేవసంఘై శ్చ ఋషిసంఘై శ్చ పూజితః**
**తస్మిన్ వేంకటశైలేంద్రే సాక్షా న్నారాయణ స్స్వయమ్!**

**లక్ష్మీదేవ్యా చ భూదేవ్యా నీలాదేవ్యా సమాగతః**
**వర్తతే వేంకటేశ స్సః సాక్షా న్మోక్షప్రదాయకః**

వేగము గల గరుత్మంతునిచే వైకుంఠమునుండి తీసుకొని రాబడిన శ్రీమన్నారాయణుని క్రీడాచలము స్వర్ణముఖినదీ తీరమున వేంకటాచలమను పేరుతో దేవతలచేత, ఋషులచేత పూజింపబడుచున్నది. ఆ వేంకటాచలమున సాక్షాత్తుగా శ్రీమన్నారాయణుడు శ్రీదేవి, భూదేవి, నీలా దేవులతో గూడి మోక్షము నొసంగువాడై విలసిల్లుచున్నాడు.

**వేంకటాచలమాహాత్మ్యం యో శృణ్వంతి నరోత్తమాః**
**తేషాం ముక్తి శ్చ, భుక్తి శ్చ ఇహలోకే పరత్ర చ**

ఎవరైతే ఈ వేంకటాచలమాహాత్మ్యం వింటారో వారికి ఈలోకంలో భుక్తి, పరంలో ముక్తికలుగుతుందని స్కాందపురాణము ద్వారా తెలియుచున్నది.

**బ్రహ్మాండపురాణములో - వేంకటాచల మాహాత్మ్యము**

**ఉక్తం మాధ్యందినే మన్యే, మాహాత్మ్యం భూధరస్య చ! (బ్రహ్మాండపురాణం)**
**వదం స్స్వ మన్త్రవాసిభ్యో గిరేః కురు ప్రదక్షిణమ్ (3-18)**

అగస్త్యమహర్షి తన శిష్యులతో మాధ్యందిన శాఖలోని (శుక్ల యజుర్వేదం) వేంకటాచలమాహాత్మ్యాన్ని పఠిస్తూ వేంకటగిరికి ప్రదక్షిణ చేసి స్వామిని సేవించాడు.

శ్రీవేంకటాచలపతి వైభవమును మీనమాసమున పౌర్ణమి తిథియందు యే పండితుడు పఠించునో, అతనికిని, భక్తితో వినువారికిని శ్రీనివాసుడు కోరిన కోరికలనిచ్చును.

**అన్నమయ్య సంకీర్తనలో వేంకటాద్రి మహిమ**

అన్నమయ్య తన సంకీర్తనలో వేంకటాద్రి మహిమను గూర్చి చక్కగా కీర్తించెను.

**కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ,**
**తెట్టలాయ మహిమలే తిరుమల కొండ**
**వేదములే శిలలై వెలసినదీ కొండ**
**యే దెసఁ బుణ్యరాసులే యేరులైనదీ కొండ**
**గాదిలి బ్రహ్మాదిలోకముల కొనల కొండ**
**శ్రీదేవుఁ డుండేటి శేషాద్రి కొండ**
**సర్వ దేవతలు మృగజాతులై చరించే కొండ**
**నిర్వహించి జలధులే నిట్ట చరులైన కొండ**
**వుర్విఁదపసులే తరువులై నిలిచిన కొండ**
**పూర్వపుటంజనాద్రి యీ పొడవాటి కొండ**
**వరములు కొటారుగా వక్కాణించి పెంచే కొండ**
**పరగు లక్ష్మీకాంతు సోబనపుఁ గొండ**
**కురిసి సంపదలెల్ల గుహల నిండిన కొండ**
**విరవైన దిదిలో శ్రీవేంకటపు గొండ** అని కీర్తించెను.

**వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన**

శ్రీ వేంకటాచలముతో సమానమగు పుణ్యక్షేత్రము ప్రపంచమున లేనేలేదు. ఆదిత్య, స్కాంద, బ్రహ్మాండ పురాణములు వక్కాణించుచున్నవి. ఈ దివ్యక్షేత్రంలో

**తరవో దైవతగణాః, మృగా శ్చ ఋషిపుంగవాః,**
**పితరః పక్షిణ స్సర్వే, పాషాణాః, యక్షకిన్నరాః**



ఈ కొండపై నున్న వృక్షాలు దేవతలు, మృగాలు, ఋషీశ్వరులు, పక్షులు పితృదేవతలు, రాళ్లు యక్షకిన్నరులని బ్రహ్మాండపురాణం వివరిస్తున్నది.

**పురాణాలలో దేవాదిదేవుడు శ్రీవేంకటేశ్వరుడు**

శ్రుతి, స్మృతి, ఇతిహాసములు, పురాణములు మన భారతీయ సంస్కృతి సంప్రదాయాలను చాటిచెప్పే పట్టుకొమ్మలు. అలాంటి గొప్ప, పవిత్రమైన సాహిత్యములో మన మహర్షులు శ్రీవేంకటాచలమును చక్కగా వివరించారు. శ్రీ వైష్ణవులు సంభావించే 108 దివ్యక్షేత్రములలో తిరువేంగడమ్ ఒకపుణ్యక్షేత్రము. ఈ శేషాద్రినే ఆళ్వారులు తిరువేంగడమ్ గా కీర్తించారు. అందుకే ఈ పర్వతాన్ని వేంకటాద్రి అని శ్రీవారిని వేంకటేశ్వరుడని పిలుస్తారు. సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపుడగు శ్రీమన్నారాయణుడే వేంకటేశ్వరుడని అన్యుడు కాదని శ్రుతి **శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే** అని వేదాంత గ్రంథాలు, పురాణగ్రంథాలు కూడా కీర్తిస్తున్నాయి. విశేషించి ఆదిత్యపురాణము, బ్రహ్మపురాణము, బ్రహ్మాండపురాణము, స్కాందపురాణము, మార్కండేయపురాణము, గరుడపురాణము, వామనపురాణము, భాగవతపురాణము, భవిష్యోత్తరపురాణము, వరాహపురాణము, పద్మపురాణములలో భక్తజనరక్షకుడిగా భక్తుల కోర్కెలను తీర్చే అభీష్టవరదునిగా, సప్తాచలాధీశునిగా, శ్రీవేంకటేశ్వరుడు కలిలో జనుల పాపములను పోగొట్టుటకు స్వామి పుష్కరిణి తీరములో వెలసిన ప్రత్యక్ష దైవముగా, కొలచిన వారికి కొంగుబంగారముగా, శ్రీ వేంకటేశ్వరస్వామి చరిత్రను విపులముగా విశదీకరించాయి.

**అయం భగవతో హృద్యః పర్వతః పుణ్యకాననః**
**మంత్రసిద్ధి స్తపస్సిద్ధి ర్యజ్ఞసిద్ధి స్తథైవ హి**
**కామ్యస్య కర్మణ స్సిద్ధి రేవ మన్యా శ్చ సిద్ధయః**
**భవ న్త్యత్ర నరాణాం చ న హి విఘ్నాదికం క్వచిత్**

**అల్పేన తపసాభీష్టం సిధ్యత్యస్మిన్ గిరౌ వరే**
**సర్వతీర్థాని సతతం పుణ్యాని నైవ న హి**
**య ఏవం సేవతే నిత్యం శ్రద్ధాభక్తిసమన్వితః**
**జ్ఞానార్థీ జ్ఞాన మాప్నోతి ద్రవ్యార్థీ కనకం బహు**
**పుత్రార్థీ పుత్ర మాప్నోతి నృపో రాజ్యం చ విందతి**
**వృజ్ఞశ్చ సాజ్ఞసద్రూపం పశూస్థాన్యాని విందతి**
**యం యం కామయతే మర్త్యః తం తమాప్నోతి సర్వదా**
**చిన్తితస్య చ సిద్ధ్యా తు చిన్తామణి మిమం విదుః**

బ్రహ్మాండాలలో వేంకటాచలక్షేత్రానికి సమానమైన స్థానము మరొకటి లేదని, అలాగే తిరుమల క్షేత్రముపై వెలసివున్న శ్రీవేంకటేశ్వరస్వామికి సాటిరాగల దేవుడు ఇటు భూతకాలములోనూ, ఆపై భవిష్యత్తులోను లేదని ఉండబోదని ఈ శ్లోకము వివరిస్తున్నది.

**వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన**
**వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి.**

శ్రీవేంకటాచలం కలియుగ వైకుంఠం. ఇది అద్వితీయమైన దివ్యపర్వతం. శ్రీమన్నారాయణుడు తన నిజభక్తులను ఉద్ధరించుటకై భూలోకమున పలు అవతారములెత్తుచుండును. ఆయా అవతారములను సేవించి పరమేశ్వరుని అనుగ్రహముచే అధ్యాత్మజ్ఞానమును పొంది, ముక్తిని పొందుట మన కర్తవ్యము. అనాదికాలముగా ప్రవర్తించుచున్న యీ సంసారమున, మనము పూర్వకర్మానుసారముగ పుట్టుచూ, మరలా గతించుచూ అంతము లేని మనకు పూర్వము ముక్తిని పొందలేదనుట సత్యము. మనము ముందు ముక్తిని పొందినయెడల నేడు మరలా సంసారపథమున రారని **"న చ పునరావర్తతే"** అను మొదలగు వేదాంతవాక్యములు చెబుతున్నవి. కావున మనము



పరమేశ్వరానుగ్రహముచేత జ్ఞానమును సంపాదించి, పరమపదమును పొందు మార్గమును అనుసరించవలెను.

**కృతే తు నరసింహో ఽభూత్, త్రేతాయాం రఘునందనః**
**ద్వాపరే వాసుదేవ శ్చ, కలౌ వేంకటనాయకః (భవిష్యోత్తర 1-36,37)**

అఖండ భరతభూమిపై ఆంధ్రదేశంలో సమున్నత వేంకటాచలంపై కలియుగనాథుడు - వేంకటేశ్వరుడు శోభిల్లుతున్నాడు. సాక్షాత్తూ పరబ్రహ్మమూర్తి విశ్వాంతర్యామియై, శేషశైలంపైన కటివరదహస్తంతో నిలిచియున్నాడు. నిత్యకల్యాణ చక్రవర్తి శ్రీవైకుంఠవిరక్తుడై, కలిదోష పీడితులైన మానవాళిని పరిరక్షిస్తున్నాడు. ఐరమ్మదీయము, అశ్వత్థామము, హిరణ్మయభవనము, అపరాజిపురము మొదలైన పరమానందస్థానాలను కలిగింది శ్రీవైకుంఠము, భక్తప్రీతిచేత దివ్యవైకుంఠాన్ని వీడి ఈ వేంకటాచలంపై వైఖానస ఆగమవిహితంగా పూజాదికాలను అందుకొంటున్నాడు. ఆశ్రయించినవారందరినీ కరుణాభరణుడై దరిచేర్చి ఉద్ధరిస్తున్నాడు.

**వేదేషు చ పురాణేషు వేంకటేశకథామృతమ్**
**వర్ణితం చేతిహాసేషు భారతాద్యాగమేషు చ**

వేదములుందు, పురాణములందు ఇతిహాసములందు, భారతాదికావ్యములందు అమృతం వంటి శ్రీనివాసుని మహిమలను తెలిపే కథలు పెక్కుగా వర్ణింపబడినవి.

మహాప్రళయసమయములో శ్రీమన్నారాయణుడు శ్వేతవరాహ రూపముతో భూమి నుద్ధరించి యథాపూర్వముగ జీవకోటిని సృజింపమని బ్రహ్మని నియమించెను. తాను సృష్టించే జీవకోటికి శ్రీమన్నారాయణుడు భూలోకమున అవతరించి భక్తిని పుట్టించకున్న జీవులు భ్రష్టులయి ముక్తిని పొందరని అనుకొని, ఏవిధముగానైనా శ్రీమన్నారాయణుడు భూలోకములో

అవతరించు ఉపాయమును చెప్పమని నారదుని అడిగెను. నారదుడు గంగాతీరమున కశ్యపాదులాచరించు యజ్ఞము వద్దకు వెళ్లి త్రిమూర్తులలోని సాత్త్వికునకు యాగఫలము దానము చేయమనగా, భృగువు బహ్మ,రుద్రులను పరీక్షించి రాజస,తామస మూర్తులుగ నిశ్చయించి, వైకుంఠమునకు వెళ్లి లక్ష్మీసమేతుడయి శేషతల్పమున నిద్రించుచున్న శ్రీహరివక్షమును కాలితో తన్నెను. తన్నినను కోపించని శ్రీహరిని సాత్త్వికమూర్తిగ భృగువు నిశ్చయించెనని పురాణములు వెల్లడించు చున్నవి.

కోపించక వినయోక్తులతో ఆదరించిన శ్రీహరిపై లక్ష్మీదేవి అలిగి వైకుంఠమును వీడి కొల్లాపురమునకు వెళ్ళెనని సర్వజ్ఞుడగు శ్రీహరి ముందుగానే ఆలోచించి వైకుంఠములోనున్న తన క్రీడాపర్వతము (వేంకటాచలము)ను భూలోకమునకు తెప్పించెను. శ్రీహరి ఒంటరిగా వైకుంఠమున నుండక భూమండలమునకు వచ్చి సువర్ణముఖరీ నదీతీరమున ఉత్తరాభిముఖముగా చూచి వేంకటాచలముపై నివసింప నారంభించెను. జీవకోటికి భక్తిని అలవరించుటకై కలియుగమున శ్రీ వేంకటేశ్వరుడు అవతరించెనని పురాణములు ప్రకటించుచున్నవి.

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు మాయాగుణములగు సత్త్వ, రజస్తమస్సుల సంపర్కముచే లోకముల సృష్టి, స్థితి,లయలను గావింతురు. బహ్మ రజోగుణ సంపర్కముచే లోకములను పుట్టించును. శ్రీహరి సత్త్వగుణ సంపర్కముచే బ్రహ్మ పుట్టించిన పదునాలుగు లోకములను పాలించును. శంకరుడు తమోగుణ సంపర్కముచే ప్రళయ కాలములో సకలలోకములను సంహరించును. ఈవిధముగా త్రిమూర్తులు తమతమ కార్యములను యథోచిత కాలములలో సాగించుచూ ఉండగా కాలచక్రము యుగరూపమున తిరుగును. ఇట్టి నాలుగు వేల యుగములు తిరుగునంత బహ్మకు ఒకరోజులో పగటికాలము పూర్తగును. బ్రహ్మకు రాత్రివేళ నాలుగువేలయుగముల పరిమితమయి ఉండును. ఇట్టి పగటికాలముతీరి బహ్మకు రాత్రివేళ



సమాప్తికాలమున ద్వాదశాదిత్యుల వేడిమికి చరాచర ప్రపంచమంత భస్మమగును. అ పిమ్మట ప్రళయ మేఘములు కుండపోతగ వర్షించును. ఈ బాహ్మాండమంతా భస్మమయి ఉండుటచే వానకుతడిసి విశీర్ణమయి నీటమునుగును. ఈ సమయములో శ్రీహరి శ్వేతవరాహరూపమును దాల్చి తన కోరలతో భూమండలము నుద్ధరించి నిలబెట్టి యథాపూర్వముగ సృజింపుమని బ్రహ్మను ఆదేశించి తాను వైకుంఠమునకేగెనని పురాణ గాథా సందర్భము.

ప్రళయములలో మునిగే భూమండలమును శ్వేతవరాహ రూపమునుదాల్చి తనకోరలతో భూమండలము నిలబెట్టి యథాపూర్వముగ సృజింపుమని బ్రహ్మను ఆదేశించెను, కాని తానా శ్వేతవరాహరూపముతో వైకుంఠమున కేగిన లక్ష్మీదేవి శ్వేతవరాహరూపముతో నుండు తనను గౌరవింపదను ఉద్దేశ్యముతో కొంతకాలము భూలోకమునందే నివసింపదలచి గరుడునిచే వైకుంఠమునందలి తన క్రీడాద్రిని (వేంకటాచలమును) భూమండలమునకు దెప్పించెనని మరియొక పురాణగాథ.

కృతయుగములో శ్రీమహావిష్ణువు నివసించుటకై భగవదాదేశముతో గరుత్మంతుడు దీనిని వైకుంఠం నుండి భూలోకానికి తీసుకొని వచ్చినట్లు మార్కండేయ పురాణం చెబుతున్నది.

**వైకుంఠలోకాద్గరుడేన విష్ణోః క్రీడాచలో వేంకటనామధేయః**
**ఆనీయ చ స్వర్ణముఖీసమీపే, సంస్థాపితో విష్ణునివాసహేతోః**

మొదటి పురాణగాథననుసరించి శ్రీహరి వైకుంఠమునకేగి రమాదేవితో సుఖముగ నివసించుచూ, ఆదిశేషుని ద్వారం దగ్గర కాపలగా పెట్టెను. అప్పుడు శ్రీహరిని చూడాలని వచ్చిన వాయువుతో గలహమును పెట్టి ఆ కలహమూలమున ఈ క్రీడాద్రి (వేంకటాచలమును)ని శ్రీహరి భూలోకమునకు తెప్పించెను.

**అయం శేషాంశజో వాయో శైలః శైలాత్మజేశ్వరః**
**హరేః సంచోదనే నైవ జాతః స్వావాసహేతవే**
**వ్యాజే నైవ త్వయాఽ నీతః తేన స్వర్ణముఖీతటమ్**

ఇది భగవంతుని క్రీడాద్రి అని సకలదేవతల ఆవాసమని, సకలతీర్థాలకు నిలయమని పురాణాలు చెబుతున్నాయి. పురాణాలు ఈ కొండను వరాహాద్రి, గరుడాద్రి, వైకుంఠాద్రి, కనకాద్రి, వేంకటాద్రి, పుష్కరాద్రి, సింహాచలం, నీలాద్రి, చింతామణిగిరి, అంజనాద్రి, నారాయణాద్రి, వృషాద్రి, వృషభాద్రి, వేదాద్రి, శ్రీనివాసాద్రి, ఆనందాద్రి, శ్రీగిరి, జ్ఞానాద్రి, శేషాద్రి, తీర్థాద్రి, సుమేరు, శ్రీరాచలం - వంటి సార్థకనామాలతో శ్లాఘిస్తున్నాయి. 28వ ద్వాపరయుగాంతమందలి ఈ కలియుగంలో శ్రీనివాసుణ్ణి నేడు అసంఖ్యాకభక్తబృందాలు ఆశ్రయించి తరిస్తున్నారు. అనునిత్యం తిరుమల వేదోక్తమైన పూజాదికాలచే భాసిల్లుచున్నది. వేదవేద్యుడైన శ్రియఃపతి నిరంతరవేదపఠనాసక్తుడైన బ్రహ్మదేవుని సేవలకు ప్రసన్నుడవుతున్నాడు. అందువల్ల వేదాద్రిగా ఈ తిరుమలను భాగవతోత్తములు కీర్తిస్తున్నారు.

దుష్టశిక్షణ, శిష్టరక్షణ, ధర్మ సంరక్షణముల కొఱకు భగవంతుడు ప్రతి యుగములోను అవతరిస్తుంటాడు. నలుగురు అవతారమూర్తులను యుగదైవములుగా పేర్కొన్నారు. ఇది నాలుగు యుగాలలో నాలుగు పేర్లతో ప్రసిద్ధి చెందినది.

**కృతే వృషాద్రిం వక్ష్యంతి, త్రేతాయా మంజనాచలమ్**
**ద్వాపరే శేషశై లేతి, కలౌ శ్రీవేంకటాచలమ్ (భవిష్యోత్తర.1.36,37)**

కృతయుగములో వృషాద్రిగా, త్రేతాయుగములో అంజనాచలముగా, ద్వాపరయుగములో శేషశైలముగా, కలియుగములో వేంకటాద్రిగా ప్రఖ్యాతి గాంచినది.



వృష శబ్దానికి ధర్మ మని అర్థం, తనవృద్ధికై ధర్మం ఈ తిరుమల క్షేత్రంలో తపస్సు చేసింది. అందువల్ల ధర్మదేవత లబ్ధిపొందిన ఈ దివ్యప్రదేశం వృషాద్రిగా ప్రసిద్ధి చెందింది.

**గిరా వస్మిన్ తప స్తేపే, ధర్మో ఽపి స్వాభివృద్ధయే**
**తస్మా దాహు ర్వృషాద్రిం తం మునయో వేదపారగాః**

భవిష్యోత్తరపురాణం ఈ వృత్తాంతం కృతయుగంలో జరిగింది కనుక ఆ యుగంలో దీనిని వృషాద్రి యని పేర్కొనేవారని తెలియజేస్తుంది.

**వేంకారో ఽమృతబీజ స్తు కట మైశ్వర్య ముచ్యతే**
**అమృతైశ్వర్యసంఘత్వాత్ వేంకటాద్రి రితి స్మృతః**

**శ్రీపదత్వాత్ శ్రియో వాసాత్ శబ్దశక్త్యా చ యోగతః**
**రూఢ్యా శ్రీశైల ఇత్యేవం నామ చాస్య గిరే రభూత్**

వేం అనగా అమృత బీజము, కటమనగా ఐశ్వర్యము అని అర్థము, వేంకట అనగా తరుగని ఐశ్వర్యరాశి అగుటచేత వేంకటాద్రి అను పేరువచ్చిందని, ఐశ్వర్యము ఇచ్చుటచేతను, లక్ష్మీకి నివాసమగుటచేతను, శబ్దశక్తిచేతను, అర్థశక్తిచేతను, రూఢశక్తిమూలముననూ ఈ పర్వతమునకు శ్రీశైలమని వరాహపురాణము తెలుపుచున్నది. అడగడుగునా అణువణువునా ఆనందాబ్ధిలో ఓలలాడజేస్తున్న వేంకటాద్రికి ఆనందాచలం, ఆనంద నిలయం అని పేరు వున్నదని ఈ శ్లోకం వివరిస్తున్నది.

**ఆనన్దజ్ఞానదం విష్ణుం ఆనన్దమయనామకమ్**
**ఆనన్దేన దదర్శాయం ఆనన్దనిలయాఽలయే**

**ఆనన్దజనకత్వా త్తం ఆనన్దనిలయం విదుః**
**వరపద్మాసనే సుస్థాం విధాయ కమలాలయామ్**

పద్మాసని అయిన వక్షఃస్థల శ్రీమహాలక్ష్మీ సమేతముగా వేంకటాద్రిని, విమానాన్ని దర్శించిన వెంటనే అవ్యక్తానందాన్ని ప్రసాదిస్తుందని చెబుతున్నది.

**విమానం సర్వపాపఘ్నం విష్ణునాఽధిష్ఠితం సహ**
**పశ్యతాం సర్వభూతానాం ఆహ్లాదజనకం శుభమ్**

శ్రీమన్నారాయణుడు నిత్యవిభూతియందు వైకుంఠమున శేషశాయి. లీలావిభూతి యందు శేషాద్రిపై స్థానకమూర్తి. శ్రీవారిసాన్నిధ్యం చేత శేషాద్రియందున్న మహిమ ఏ ఇతర క్షేత్రమునకు లేదు.

**శేషాచలే యన్మాహాత్మ్య మన్యక్షేత్రే న తత్ క్వచిత్**
**తద్గతశ్రీనివాసస్య మహిమా నాన్యగః శుభః**

ఈ కలియుగమున శేషాద్రిపై నెలకొనియున్న వేంకటేశ్వరుని మహిమలు ఇతర పుణ్యక్షేత్రములందున్న అర్చామూర్తులందు కనిపించదు.

**ప్రవఃపాన్థ మనసో ధియాయతే! మహే శూరాయ విష్ణవే చార్చత**

అన్న మంత్రంచేత ప్రతిపాదించబడుతున్న విష్ణ్వర్చావతారమూర్తిగా అవతరించిన లక్ష్మీవల్లభుడు, సర్వజగన్నియామకుడు. ఈస్వామి వెలసిన కొండను బంగారుకొండగా, పాపాలను తొలగించి రక్షించే కరుణాస్థానంగా ఎందరో కీర్తిస్తున్నారు. తొలి తెలుగు వాగ్గేయకారుడు అన్నమయ్య –

**వేదములే శిలలై వెలసినదీ కొండ! యేదెస పుణ్యరాసులే యేరులైన దీ కొండ!**
**గాదిలి బ్రహ్మాదిలోకములకొనల కొండ! శ్రీదేవు డుండేటి శేషాద్రి ఈ కొండ!**

అని ఈ కలియుగ వైకుంఠం నిజవిలాసాన్ని ఆవిష్కరించాడు. శ్రీవేంకటాచలమాహాత్మ్య పురాణములో శ్రీవేంకటేశకథామృతము, వేంకటాచలక్షేత్ర తీర్థముల మహిమలు వర్ణింపబడినవి. స్వామి పుష్కరిణి శ్రీవారి దేవాలయము యొక్క ఉత్తరప్రాకారమును ఆనుకొని వున్నది. దీని ప్రభావము వర్ణనాతీతము. గంగాది పుణ్యనదీ సముహములకు మాతృదేవత. సకలతీర్థములలో మిక్కిలి శ్రేష్ఠమైనది. ఈ పుష్కరిణి వైకుంఠమున శ్రీదేవి, భూదేవి, నీళాదేవులతో శ్రీమన్నారాయణుడు క్రీడించినదని, శ్రీవరాహావతార కాలమున వారికి భూలోక నివాసార్థమై గరుడునిచే వైకుంఠమున నుండి క్రీడాద్రితో తేబడినదని పురాణ ప్రసిద్ధి.



సర్వపాపములు స్వామిపుష్కరిణిలో స్నానము చేసిన తొలగును. సకలదోషములను పోగొట్టును. సకలార్థములను ఇచ్చును. కోరికలను తీర్చునని వరాహపురాణములో వర్ణింపబడినది.

**స్వామి పుష్కరిణీస్నానం సద్గురోః పాదసేవనమ్**
**ఏకాదశీవ్రతం చాపి త్రయ మత్యంతదుర్లభమ్**

**దుర్లభం మానుషం జన్మ దుర్లభం తత్ర జీవనమ్**
**స్వామిపుష్కరిణీస్నానం త్రయ మత్యన్తదుర్లభమ్**

**అత స్తస్య తు మాహాత్మ్యం వక్తుం శేషో ఽపి న ప్రభుః**
**యత్తు స్వామిసరఃస్నానం మహాపాతకనాశనమ్**

స్వామిపుష్కరిణితీర్థములో స్నానమాచరించుటచే రాజ్యభ్రష్టుడగు శంఖణుడు మరల తన రాజ్యమును పొందెను. శంఖణునకు స్వామిత్వమును కలుగజేయుటచే ఈ తీర్థమునకు స్వామితీర్థమను పేరు కలిగెనని పురాణములో గలదు. మరియు ఈ తీర్థము సకల తీర్థములకు స్వామి కనుక ఈ తీర్థము స్వామితీర్థమనబడునని పురాణములు వర్ణించెను. ఇట్టి పరమపావనములగు తీర్థముల వేంకటాద్రిపై ముక్కోటిగా నిండియుండుటయే ఈ కొండయందలి గొప్పదనము.

స్వామిపుష్కరిణి వాయవ్యమున వరాహదేవాలయమును, ఉత్తరమున అశ్వత్థవృక్షము (రావిచెట్టు) కలవు.

శ్రీవారు ఆకాశరాజు కూతురైన శ్రీపద్మావతిని వివాహము చేసుకొను సందర్భమున వివాహ ఖర్చులనిమిత్తము కుబేరుని వద్ద ఋణము తీసుకొని ఈ వృక్షము క్రింద పత్రము వ్రాసిఇచ్చారని పురాణము చెప్పుచున్నది.

ధనుర్మాసమున ముక్కోటిద్వాదశినాడు శ్రీ చక్రత్తాళ్వార్లు తీర్థము ప్రసాదింతురని అది చాలా పుణ్యకాలమని అదేవిధముగా చైత్రమాసములో తెప్పోత్సవము అతివైభవముగా జరుగునని వరాహపురాణము చెప్పుచున్నది.

భక్తులు పుష్కరిణియందు స్నానంచేసి తొలుత శ్రీవరాహస్వామివారిని దర్శించుకొనవలయును. పిదప శ్రీవేంకటేశ్వరుని దర్శించవలెనని పురాణ ఐతిహ్యము.

తిరుమల శ్రీవరాహక్షేత్రము, శ్రీవారు ఈ పర్వతమున ఆవిర్భవించిన అనంతరము శ్రీవరాహస్వామిని 100 అడుగుల నేలను యాచించి తీసుకున్నారని తత్ కారణముగా అగ్రపూజా నైవేద్యములు మొదట శ్రీవరాహస్వామికి చేయించి పిదప స్వామి నైవేద్యమంగీకరింతురని తెలుపుచున్నది.

**స్థలం దేహ్యవనీకాంత యావత్కలియుగం భవేత్,**
**ఇతి తేన స విజ్ఞప్తో వరాహవదనో హరిః**

**ఉవాచ వచనం దేవస్థలం మాల్యేన గృహ్యతామ్,**
**ఇతి వాక్యం తతః శ్రుత్వా ప్రోవాచ మధురం వచః**

**ప్రథమం దర్శనం చాస్య నైవేద్యం క్షీరసేచనమ్,**
**ఇద మేవ పరం ద్రవ్యం దదామి కరుణానిధే**

**ఇత్యుక్తో హరిణా పోత్రీ హరయే స్థాన ఉ౦,**
**తదా దదౌ స్థలం పాద శతమాత్రం రమాపతేః**

ఈ వరాహస్వామి గుడికి ముందుండు పుష్కరిణి భాగమునకు వరాహ పుష్కరిణి యను ప్రత్యేక నామము గలదు. శ్రీవరాహస్వామివారి దర్శనమునకుముందు శ్రీవేంకటేశ్వరస్వామి వారిని సందర్శించుట శ్రీవారికి తృప్తికరము కాదు అని బ్రహ్మపురాణ వచనము.



**వరాహదర్శనా త్పూర్వం శ్రీనివాసం నమే న్న చ!**
**దర్శనా ప్రాగ్వరాహస్య శ్రీనివాసో న తృప్యతి**

ఈ దేవస్థానము చాల పురాతనమైనది. కలియుగారంభమున నారాయణ పురాధీశుడుగా నుండిన ఆకాశరాజు తమ్ముడు శ్రీనివాసుని పరమభక్తుడగు తొండమాన్ చక్రవర్తి యీ దేవాలయమును గోపురప్రాకార సహితముగ కట్టించి శ్రీనివాసుని మహోత్సవ వైభవంబులతో నిలపెనని బ్రహ్మపురాణవచనముల వలన తెలియుచున్నది.

**తొండమానితి తం ప్రాహుః ద్రావిడా ద్రవిడేశ్వరమ్,**
**జన్మ ప్రభృతిదాస స్సదా విష్ణుపరాయణః (బ్రహ్మ. 7.52)**

**మండలాధిపతి ర్భూత్వా దివ్యనారీసహస్రభాక్,**
**ప్రత్యహం చ బిలద్వారా ద్గత్వా వేంకటపర్వతమ్**

**అన్వహం చ కరోతి స్మ పూజాం తస్య మహాత్మనః,**
**భక్త్యుద్రిక్తమనో భూత్వా దదౌ గ్రామా ననేకశః**

**ప్రాకారద్వయసంయుక్తం గోపురద్వయసంయుతమ్,**
**గర్భాగారసమాయుక్త మకరో ద్దివ్య మాలయమ్**

**తథా మహానసాగారం యాగమండప మేవ చ,**
**ధాన్యాగారం చ గోశాలాం యద్యదంగం హరే శ్శుభమ్**

**కారయామాస తత్సర్వం, అష్టావింశే కలౌ యుగే**
**తథోత్సవవిధిం తస్య కారయామాస వైద్విజైః (బ్రహ్మ. 7.52-57)**

**వైఖానస ఋషి శ్రేష్ఠైః బ్రాహ్మణైర్బ్రహ్మవిత్తమైః,**
**ఋక్సామగాయకై శ్చైవ మంత్రై శ్చ విధిపూర్వకమ్**

**వాదిత్రైర్వాద్యమానై శ్చ ఘోషయద్భి ర్దిశో దశ,**
**దేవై ర్బ్రహ్మపురోగై శ్చ స్తువద్భి స్స్తుతిభి ర్హరిమ్**

**ప్రవేశయామాస వరం సుమందిరం, శ్రీశ్రీనివాసం పురుషం పురాణమ్**
**పద్మావతీం చాపి ముదా మహీపతిః, సమ స్తలోకై ర్మునిభి ర్మహోత్సవైః**

**తత ఆనందనిలయే తొండమాన్ నృపనిర్మితే,**
**విమానాగ్ర్యే శ్రీనివాసో రరాజ భగవాన్ హరిః**

తంజావూరును పరిపాలించిన ప్రప్రథమ చోళచక్రవర్తి కరికాల చోళుని కుమారుడు తొండమానుచక్రవర్తి దేవాలయనిర్మాణము చేపట్టేనని చరిత్రకారుల అభిప్రాయము. కాలక్రమమున హిందూ రాజులచే దేవాలయగర్భగృహము పునరుద్ధరణము గావింబడి, విమానము బంగారు పూతచే నలంకరింపబడి స్వర్ణ కలశము ప్రతిష్ఠింపబడెను.

* * *



## 3. శాసనముల ద్వారా తిరుమల తిరుపతి దేవాలయాల చరిత్ర

శ్రీవేంకటాచల దివ్యక్షేత్రము పూర్వము అనేకరాజుల పరిపాలనలో నుండెనని శ్రీవేంకటాచల క్షేత్రమాహాత్మ్య పురాణము ద్వారా తెలియుచున్నది. రాజులకు శ్రీవేంకటాచల క్షేత్రముతో గల సంబంధమును నిరూపింపగల శాసనాధారములు తిరుమల ప్రాచీన చరిత్రను సజీవముగా నిలుపుతున్నవి. ఈ శాసనములను అప్పటి మద్రాస్ ప్రభుత్వము 1922 నుండి 1927 వరకు 5 సంవత్సరములు అవిశ్రాంతముగా సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచేత నిశితముగా పరిశీలించి, వాటిలో సుమారు 1252 పైగా సేకరించి, చారిత్రక విషయాలను భద్రపరిచింది. ఈ శాసనాలు కీ.శ 800 మొదలు క్రీ.శ 1909 వరకు గల కాలానికి సంబంధించినవి. పల్లవ, చోళ, పాండ్య, విజయనగర రాజవంశీయులకు సంబంధించిన తిరుమల క్షేత్ర యాత్ర, దాన వివరములను యీ శాసనాలు తెలియజేస్తున్నాయి.

తిరుమలచరిత్రకు సంబంధించి మనకు లభించిన అత్యంత ప్రాచీనమైన శాసనం క్రీ.శ 800వ నాటిది. ఇది తమిళములో వ్రాయబడినది. ఈ తమిళ శాసనములో శ్రీవేంకటేశ్వర ఉత్సవమూర్తి దగ్గర దీపం పెట్టడానికి మూలధనముగా పల్లవరాజైన కోవిజయదంతి విక్రముని కాలములో ఉళగప్పెరుమనారు అనే భక్తుడు తిరుమలలో చేసిన దీపదానాన్ని వివరిస్తున్నది. అత్యంత ఆధునికమైన 1908 నాటి శాసనం శ్రీ వేంకటేశ్వర స్వామివారి ఆలయ విమానం పై గల కలశస్థాపనను గురించి తెలియ జేస్తుంది.

ఈ దానశాసనాలలో 70 మాత్రమే తెలుగు లిపిలో వున్నాయి. 1150 శాసనాలు తమిళ గ్రన్థలిపిలో వున్నాయి. మిగిలినవి సంస్కృతములోను, కన్నడములోను ఉన్నాయి. వీటిలో సాళువ నరసింహరాయలు కాలానికి సంబంధించిన శాసనాలు 169, కృష్ణదేవరాయలు కాలానికి సంబంధించినవి

229, అచ్యుతరాయకాలానికి సంబంధించినవి 251, సదాశివరాయల కాలానికి సంబంధించినవి 147, ఆరవీడు వంశరాజుల కాలంనాటివి 135 వున్నాయి. ఈ శాసనాలను రాజులు లేక వారి అనుచరులైన అధికారులు, సామంత రాజులు, సంపన్నులు, మొదలైన వారెందరో తిరుమల దేవునికీ వారు సమర్పించిన కానుకల్ని శిలాక్షరాలద్వారా నిరూపించారు. ఈ శాసనాల ద్వారా కృష్ణదేవరాయలు ఏడుపర్యాయములు తిరుమల క్షేత్రాన్ని సందర్శించినట్లు తెలియుచున్నది.

16వ శతాబ్దంలో వ్యాసరాయ మత స్థాపకులైన వ్యాసతీర్థులు తిరుపతి క్షేత్రాన్ని దర్శించినట్లు శాసనాలవల్ల మనకు తెలియుచున్నది. ఇంతే కాకుండా రాజాస్థానాలలోగల ప్రముఖోద్యోగులు, వైదిక బ్రాహ్మణులు మొదలైనవారు వేయించిన శిలాసనాలు శతాధికసంఖ్యలో వున్నాయి. వీటిలో అధిక సంఖ్యకు చెందిన శాసనాలలో దేవుని దీపారాధనకు కావలసిన నేతిని సమకూర్చే నిమిత్తము ఎందరో దాతలు గోవులను దేవునికి సమర్పణ చేశారని, నిత్యనైవేద్యము కోసం అగ్రహారాలను శ్రీనివాసునికి అంకితం చేసిన వదాన్యులను గురించీ, అటువంటి అగ్రహారాలలో సస్యవృద్ధికి అనువైన జలాశయాలను నిర్మింపజేసిన మహానుభావులను గురించీ, దేవపూజకోసం పూలతోటలను వేయించిన భక్తవరేణ్యులను గురించీ, మూలవిరాట్టుకు, ఉత్సవ విగ్రహాలకు సమర్పితమైన, నవరత్నఖచిత సువర్ణాభరణాల గురించి మనకు తెలియజేస్తాయి. వేదపారాయణకు, పురాణపఠనానికి, బహ్మోత్సవం, వసంతోత్సవం వంటి ఉత్సవాలకు సంబంధించిన శాసనాలు అధిక సంఖ్యాకంగా వున్నాయి.

ఈ శిలాఫలకాలతోపాటు 16వ శతాబ్దంనాటి తాళ్లపాక చినతిరుమలాచార్యులవారు, సంస్కృత ప్రాకృత, శూరసేన, మాగధి, పైశాచి, అవంతి భాషలతో కలిపి అష్టభాషాదండకం వాసిన తామ్రఫలకాలు లభ్యమవుతున్నాయి.



కొండకు వెళ్లే మార్గం ప్రారంభమైన అడిపడి (అలిపిరి) దగ్గర లక్ష్మీనారాయణ దేవాలయం గోడలమీద శక సంవత్సరం 1550 (క్రీ.శ.1628) నాటి నలభై ఒక్క చరణాలుగల సీసమాలిక తెలుగులిపిలోను, గ్రన్థలిపిలోను, దర్శనమిస్తుంది. ఇది మట్ల కుమార అనంతరాజు అలిపిరి నుండి గాలిగోపురం వరకు వున్న సోపానమార్గమును , కొత్తగోపురాన్ని, గాలి గోపురాన్ని నిర్మించాడని తెలియచేస్తుంది. ఈ సోపాన పంక్తి ఏర్పడక ముందు కపిలతీర్థము నుంచి గాలిగోపురం వరకు వేరొక మార్గం వుండేదని, ఇది గాక మోకాళ్లపర్వతం నుంచి చివరి వరకు మరొక మార్గం ఉన్నదని శక సంవత్సరం 1887లో వెలసిన శాసనంవల్ల (T.T. 53 ) మనకు తెలుస్తున్నది.

చోళరాజుల తిరుమల సేవ - నిరుపమానమైన మహానగరాలను దేవాలయాలను నిర్మించడంలో చోళ చక్రవర్తులది అందె వేసిన చేయి. చోళులకాలంలోగల తిరుమల శాసనాలను పరిశీలించినట్లయితే సప్తగిరివాసునకు వారు సమర్పించిన కానుకలతో పాటు ఆకాలపు పరిపాలన విధానం కూడా యథాతథంగా మనకు వ్యక్తమౌ తుంది. మదిరై కొండకోపర కేసరి వర్మన్ లేక పరాంతక1 అనే చోళ చక్రవర్తి శాసనం జి.టి.232, 234 తిరుచానూర్ లో వుంది. మొదటి పరాంతకుడు కీ. శ॥ 905 నుంచి 956 వరకు పరిపాలించాడని, ఈయన వేంకటేశ్వర స్వామికి రెండుసార్లు దీపస్తంభాలను కానుకగా సమర్పించాడని శాసనాలు చెబుతున్నాయి. మొదటి రాజరాజచోళుని తండ్రి రెండవ పరాంతక సుందర చోళుడు సతీమణి దేవిఅమ్మనార్ స్వామికి రత్నసంఘటిత హేమపతకాన్ని సమర్పించారని T.T.17వ నంబరు శాసనంలో వుంది. క్రీ.శ 935వ సంవత్సరములో మలైనాడుకు చెందిన కొడుంగోలూరన్ అను భక్తుడు స్వామి దీపారాధనకోసం 40 బంగాగు నాణేలను దేవస్థానమునకు ఇచ్చినట్లుగా G.T.215 నంబరుగల శాసనంలో వుంది. T.T. నంబరు 20 శాసనంవల్ల

మొదటిరాజ చోళుడు తిరుమలలో 24 దీపాలను వెలిగించడానికి ఘృతాన్ని ఏర్పాటు చేశాడని తెలుస్తున్నది. G.T.126 నంబరు గల శాసనం మూడవ రాజ రాజు పరిపాలనకు వచ్చిన 19వ సంవత్సరంలో లిఖితమైనది. ఈ శాసనములో తిరుమంగైఆళ్వార్ విగ్రహాన్ని శ్రీగోవిందరాజస్వామి ఆలయప్రాకారంలో ప్రతిష్ఠించారని కుడవూర్ గ్రామంలో కొంతభూమిని ఇచ్చి దానిమీద వచ్చే గ్రాసంతో యీ దేవునకు నిత్య భోగాదులు జరిపించాలని వుంది.

చోళరాజైన కొప్పాత్ర పార్థివేంద్రవర్మ 14వ పరిపాలనా సంవత్సరములో పల్లవరాణి శక్తి విటంకన్ భార్య సామవై పెరుందేవి తిరుమలయాత్ర చేసి శ్రీవేంకటేశ్వరస్వామికి ఉత్సవవిగ్రహంగా భోగశ్రీనివాసమూర్తి (మనవాళప్పెరుమాళ్) అని పిలిచే వెండి విగ్రహాన్ని తిరుమల శ్రీవారి ఆలయంలో తిరువిలనాన్ కోయిల్ లో 8-6-966 తేదీన ప్రతిష్ఠించింది. సామవై పెరుందేవి ఈఉత్సవవిగ్రహానికి అనేక సువర్ణాభరణాలను సమర్పించింది. పెరటాసి, మార్గళి (ముక్కోటి ఏకాదశి) నెలల్లో బ్రహ్మోత్సవాలు ఏర్పాటుచేసింది. వీటి నిర్వహణకై 4177 కుళీల భూమిని దానం చేసింది.

* * *



## 4. రాయలవారి వేంకటేశ్వరుని సేవ

విజయనగర చక్రవర్తి శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ 1509-1530 తిరుమల వేంకటేశ్వర స్వామికి అనన్యభక్తుడు. ఉత్కలదేశ కటకం మొదలు కన్యాకుమారి వరకు గల విశాలసామ్రాజ్యాన్ని, ఏకచ్ఛత్రాధిపత్యాన్ని వహించిన శ్రీకృష్ణదేవరాయలు ఏడుసార్లు శ్రీవారిని దర్శనం చేసుకున్నాడని, ఈ తీర్థయాత్రలలో కొన్నిసార్లు దేవేరులైన తిరుమలదేవి, చిన్నాదేవి కూడా తమ ఏలికతో కలిసి దేవదర్శనం చేసుకున్నారని శాసనాల ద్వార తెలియుచున్నది.

రాయలు ఆముక్తమాల్యద అను ప్రబంధాన్ని రచించి వేంకటేశ్వర స్వామికి అంకితమిచ్చాడు. ఆ ప్రబంధంలో అలమేల్మంగాభిదేందిరాలయ వక్షా అలమేలుమంగ అను పేరు గల లక్ష్మీదేవికి నిలయమైన వక్షము గలవాడా - శ్రీనివాసుడా అని సంబోధించినాడు. మరోక చోట శ్రీ మందిర భుజమధ్యమ కృష్ణదేవరాయలవారి భువనవిజయసభలో అధిష్ఠితులైన అష్టదిగ్గజాలలోని అల్లసానిపెద్దన కృతియైన మనుచరిత్రలో ప్రథమాశ్వాసంలో గల ఈ పద్యము కరుణాకర వేంకటవిభుచరణ స్మరణ ప్రసంగ సంగతమతికిన్ శేషాచలపతి పై శ్రీ కృష్ణదేవరాయలకు గల ప్రగాఢమైన భక్తిభావాన్ని తెలియజేస్తాయి.

తిరుమలలోగల సుమారు 50 శాసనాలలో రాయలకు, అతని సతీమణులకు సంబంధించిన ప్రసక్తి వుంది. వీరు శ్రీనివాసునకు సమర్పించిన మణిస్థగిత సువర్ణకిరీటాద్యాభరణాలను గురించిన్నీ, దానం చేసిన అనేక అగ్రహారాల గురించిన్నీ, యీ శాసనాలు, నాటికీ, నేటికీ చెరిగిపోని ఆధారాలుగా నిలుస్తున్నాయి.

క్రీ.శ 10-02-1513 నాడు మొదటిసారి తన యిద్దరు రాణులతో తిరుమల వచ్చి స్వామికి, సువర్ణరత్నకిరీటం, కర్పూరహారతినిచ్చే 25

వెండిపళ్లేలు సమర్పణ చేశారని, స్వామి పాలను ఆరగించే నిమిత్తం రాణులు ఒక బంగారుపాత్రను సమర్పించారని తిరుమలలో గల 3 గ్రంథలిపి శాసనాలు, 2 తెలుగు శాసనాలు, 2 కన్నడ శాసనాలు రాయలు తన ఆరాధ్య దైవానికి సమర్పించిన యీ కానుకల విశేషాలను వివరిస్తున్నాయి.

తేదీ 02-5-1516 నాడు జరిగిన ద్వితీయ తిరుమల క్షేత్ర సందర్శన సమయంలో ఉత్సవమూర్తులకు మూడు మణిమయ కిరీటాలు, మూలవిరాట్టునకు చాలా విలువ గలిగిన ఆభరణాలు సమర్పించారని తెలుస్తున్నది.

మూడవ తిరుమల యాత్ర16-06-1516 నాడు జరిగిందని, రెండవ తీర్థయాత్ర జరిగిన నెలా పదిహేను రోజుల లోపలే యీ తృతీయ పర్యటన జరిగిందని, ఈ సమయంలో జగచ్చక్రవర్తికి నిత్యనైవేద్యం నిమిత్తం ఐదు గ్రామాలను దానం చేశారని, దీనిలో యితర వివరాలతో పాటు శ్రీకృష్ణదేవరాయల వంశవర్ణనకూడా వ్యక్తమౌతుంది. వీరిది చంద్రవంశం గనక చంద్రుడు, బుధుడు, పురూరవుడు, నహుషుడు, యయాతి, మొదలైన పూర్వవంశోద్ధారకులను, స్మరించిన అనంతరం తుర్వసువంశంలో తిమ్మభూపతి ఉద్భవించాడని, అతని పుత్రుడు ఈశ్వరుడనిన్నీ కృష్ణునకు మన్మథుడు జన్మించినట్టు, అతనికి నరసభూపతి కలిగేడనిన్నీ ఆయనకు తిప్పాజీ అనే ఆమెవల్ల వీరనరసింహేంద్రుడు, నాగలదేవివల్ల, శ్రీకృష్ణదేవరాయలు ఉద్భవించేరనిన్నీ సుదీర్ఘమైన ఈ శాసనం ద్వారా తెలుస్తున్నది.

చతుర్థదర్శనం 6.7.1614 తేదీన విజయోత్సాహంతో సతీసమేతంగా కృష్ణదేవరాయలు తిరుమల శ్రీవారిని దర్శించారు. ఆ సమయంలో తిరువెంగళనాథునకు ముప్పైవేల వరహాలతో కనకాభిషేకం చేయుట కొరకు ప్రత్యేకంగా బంగారు నాణెంపై సర్వాభరణ భూషితుడైన వేంకటేశ్వరస్వామి అలంకారశోభితమైన మకరతోరణము మధ్యలో పద్మపీఠముపై నిలబడియున్నాడు. నాణెము వెనుకవైపు నాగరిలిపిలో మూడుపంక్తులలో శ్రీ,కృష్ణ,రాయ అను లేఖనం కలదు. తదుపరి కొన్ని ఆభరణాలను స్వామికి సమర్పించి పొత్తపినాటిసీమలో గల తాళ్లపాక అనే గ్రామాన్ని స్వామి నిత్యారాధనకోసం, దానపట్టా వాసియిచ్చారని శాసనాల ద్వార తెలుస్తున్నది. క్రీ.శ 20-10-1615వ తేదీన శ్రీ వేంకటేశ్వరునకు నవరత్నములతో కూడిన మకరతోరణాన్ని సమర్పించారని నాలుగు శాసనాల్లో కనపడుతున్నాయి.



2.1.1517వ తేదీన ఐదవసారి తిరుమలేశుని దర్శనం చేసుకొని పరమేశ్వరుని వక్షస్థలంపైన మెరిసిపోయే కౌస్తుభంవంటి పతకంతో కూడిన కంఠమాలను, ముప్పైవేల వరహాలతో ఆనందనిలయ దివ్యవిమానానికి బంగారు తాపడం చేయించినట్టు 9-9-1518 నాటికి పూర్తి అయినట్లు 3-80,3-81 శాసనాల వల్ల తెలుస్తున్నది.

తిరుమల దేవాలయ విమానమును (ఆనందనిలయవిమానం) తొండమండలాధిపతి వీరనరసింగయాదవరాయలు (క్రీ.శ.1209-1262) నిర్మించినాడు. తన జైత్రయాత్రకు ఫలితముగా, తన విజయములను భగవదనుగ్రహముగా భావించి తిరుమల దేవాలయంలో స్వర్ణతులాభారము తూగి ఆ బంగారముతో శ్రీవారి ఆనందనిలయానికి మొదటిసారి తాపడం చేయించి దానిని మేరుపర్వతముతో సమముగా ప్రకాశించునట్లు చేసినాడు. రెండవసారి బుక్కరాయల పాళియగాండ్లలో ఒకడైన సాళువ మంగిదేవ మహారాజు క్రీ.శ 1409 కాలంలో, మూడవసారి అమాత్య శేఖరమల్లన కాలములో జరిగినట్లు, రాయలకాలంలో నాల్గవసారి జరిగినట్లు శాసనాల ద్వారా తెలుస్తున్నది.

బంగారు తాపడం చేయించిన ఐదు వారాలలోపునే అనగా 16-10-1518వ తేదీన తన పుత్రునితో రాయలు ఆరవ యాత్రను పూర్తి చేసినట్టు కనిపిస్తుంది.

17-02-1521వ తేదీన రాయలు సప్తమ పర్యటన జరిగింది. అప్పుడు ముత్యాలూ, వజ్రాలు, పచ్చలు, మొదలైనవాటితో అద్భుతంగా తయారు చేసిన కుల్లాయి, పదివేల వరహాలు శ్రీనివాసునికి సమర్పించారని శాసనాల ద్వార తెలుస్తున్నది.

పెనుగొండ రాజ్యపరిపాలకుడు ఒకటవ శ్రీరంగరాయలు క్రీ.శ 1572-1585 వేయించిన వేంకటేశ్వర బంగారు నాణెములు రాయలు ముద్రించిన నాణెమువలె ఉన్నవి. వెనుక వైపు శ్రీరంగరాయ అను లేఖనం కలదు.

చంద్రగిరి రాజ్యపరిపాలకుడు రెండవ వేంకటపతి రాయలు క్రీ.శ 1586-1614 ముద్రించిన బంగారు నాణెములో వెంకటేశ్వరుడు పూర్వపు నాణెము వలె నిల్చొని యున్నాడు. వెనుకవైపు శ్రీవెంకటేశ్వరాయ నమః అను లేఖనము కలదు. వేంకటపతిరాయలు అర్ధవరాహనాణెము కూడా ముద్రించినాడు. దానివెనుక వీరవేంకటరాయ అను వ్రాతకలదు.

**ఇతరరాజులు** - రాయల అనంతరము అనేక దండయాత్రలు జరిగి శ్రీవారి ఆలయానికి, భక్తులకు ధ్వంసము జరిగినది. 1684 వ సంవత్సరములో శివాజీ అనుచరుడు తిరుమల శ్రీవారికి బంగారు కానుకలు ఇచ్చేను.

* * *



## 5. శ్రీమద్రామానుజాచార్యులవారి శ్రీవారి సేవ

విశిష్టాద్వైత మతస్థాపకులైన శ్రీమద్ రామానుజాచార్యుల వారికిన్నీ తిరుపతికిన్నీ గల సంబంధాన్ని సూచించే ప్రాచీన గాథలెన్నో వున్నాయి. శ్రీగోవిందరాజులవారి విగ్రహాన్ని, ఆళ్వారులవిగ్రహాలను శ్రీమద్రామానుజాచార్యులవారే తిరుపతిలో నెలకొల్పినట్టు గురుపరంపర వల్ల తెలుస్తున్నది.

రామానుజులకు తిరుపతికి తిరుమలకు అనుబంధముండటానికి, పెరగటానికి చాలా కారణాలున్నాయి. మొదటిది - విశిష్టాద్వైతానికి మూలకందమయిన దివ్యప్రబంధంలో ఆళ్వారుల వేంకటేశ్వరాత్మక పాశురాలు రెండువందల ఏబది కంటే పెచ్చు ఉండటం. రెండవది- రామానుజులు తిరుమల రాకకు మునుపే రామానుజుల మేనమామ తిరుమలనంబి తిరుమలలో స్వామివారికి తన పరిధిలో తోయ, పుష్ప, కైంకర్యాదులు చేస్తూ అక్కడే స్థిరనివాసం చేయడం. మూడవది - తన ఆనతితో అనంతాళ్వార్ ను భార్యతో తిరుమలకు చేరి పూలతోట నిర్మాణానికి చెఱువు త్రవ్వి తోటను పెంచి, పూచిన పుష్పాలను శ్రీవారికి అర్పిస్తూ తిరుమలలోనే నివసించడం. నాలుగవది- తిరుమల శ్రీవైష్ణవక్షేత్రం కనుక వైష్ణవులైనవారు తమ జీవితకాలములో ఒకసారైనా తిరువేంగడమ్ దర్శించాలని ఉబలాటపడటమూ కారణం కావచ్చు. ఐదవది- శ్రీరంగం లాంటి ఆలయాలలో పూజాదికాలు సక్రమముగా నిర్వహించడానికి నియమావళిని ఏర్పరచిన రామానుజులు కర్ణాకర్ణిగా తిరుమల మీద శ్రీవారి సేవలు అనేక కారణాలవలన సక్రమముగా జరగడం లేదని, తిరుమలనంబి, అనంతాళ్వార్ ద్వారా రూఢిపరచుకొని వాటిని చక్కదిద్దడానికోసం శ్రీవారి కైంకర్యాలు తన వంతుగా బాగా జరపడానికి ప్రయత్నించాలనుకోవడం తిరుమలతో అనుబంధాన్ని కలిగించాయి. రామానుజులవారు తిరుమలకు మూడుసార్లు విచ్చేశారు. తొలిసారి స్వామివారి విగ్రహం శైవాత్మకమా

విష్ణుత్వమా అనే సందేహాలపై విస్తృతవాద ప్రతివాదనలు జరిపాక యాదవరాజుల సమక్షంలో కొండమీది దేవుడు శ్రీనివాసుడే అని ఆధారాల బలంతో నిర్ణయం ఏర్పడ్డాక గర్భగుడిలో శంఖచక్రాదులుంచిన సందర్భములో రామానుజులు తొలిసారిగా వచ్చారనడం ఒకవాదం. ఇందుకు ప్రబల సాక్ష్యం శ్రీవేంకటాచలేతిహాసమాల గ్రంథం.

తిరుమల ఆలయంలో వెయ్యిసంవత్సరాలకు పూర్వం నుండి ఆలయ వ్యవహారాలు, స్వామి వారి కైంకర్యానికి కావలసిన ఏర్పాట్లు, నైవేద్యప్రసాదాల వినియోగం, భక్తులు సమర్పించు కానుకల సంరక్షణకు ఆలయాధికారుల వ్యవస్థ ఉండేది. వీరు రాజశాసనాకి బద్ధులై కర్తవ్యనిర్వహణ చేసేవారు. శ్రీవేంకటేశ్వరస్వామివారి అర్చనాది పూజా కైంకర్యాలు ఆగమపద్ధతిలో సంప్రదాయానుసారం చేయడానికి వైఖానస అర్చక వ్యవస్థ ఉండేది. శ్రీరామానుజాచార్యులు తిరుమల ఆలయాన్ని తొలిసారి దర్శించినప్పుడు బహుశా 1052 అక్కడి ఆలయంలోని కైంకర్యపరులు సేవకులు వారివారి సేవలు సక్రమంగా నిర్వహించుచున్నారా అని పరిశీలించారు. ఈపనులన్నీ సక్రమంగా జరుగుతున్నాయా? సకాలంలో స్వామివారి కైంకర్యాలు నిర్వహింప బడుతున్నాయా? అన్నది పర్యవేక్షించడానికి మూడో వ్యవస్థ అవసరం ఎంతైనా ఉన్నదని భావించారు. ఈ దివ్యక్షేత్రంలో స్వతహాగా నియమనిష్ఠలు కలిగి, శాస్త్రంలోను, పాండిత్యంలోను, ఎవరూ అపచారాలు చేయకుండా, అవినీతికి పాల్పడకుండా సేవ సమయంలో ఆలయంలోనే ఉండేవాడుగాను, ఉండే వ్యవస్థకూడా అవసరం ఉన్నదని భావించి ఏకాంగి వ్యవస్థ ఏర్పాటు చేశారు. తనకు విధేయులైన శ్రీశైలపూర్ణులను, అనంతాచార్యులను ఈ వ్యవస్థను నడిపించాలని ఆదేశించారు. ఈ విధంగా తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయంలో మొత్తం నాలుగు వ్యవస్థలు వారి వారి పరిధిలో బాధ్యతలు నిర్వహించడానికి ఏర్పడ్డాయి. శ్రీశైలపూర్ణులు, అనంతాచార్యులు మొదలైన శాస్త్ర పాండిత్యప్రతిభ గలవారు తర్వాత కాలంలో



ఆచార్యపురుషులుగా ప్రసిద్ధి కెక్కారు. మిగతా మూడు విభాగాలు అంటే అర్చకులు, ఆలయాధికారులు, ఏకాంగి విధులను సక్రమంగా చేస్తున్నారో లేదో చూడడం, ఆగమ సంప్రదాయాల విషయాలలో సందేహాలను నివృత్తి చేయడం వీరి బాధ్యత. ఆలయాధికారులు అందించే పదార్థాలు ఆమోదయోగ్యంగా ఉన్నాయా, స్వామివారి కైంకర్యానికి, (వస్తువుల చిట్టా) ప్రకారం ఇస్తున్నారా, సమయపాలన చేస్తున్నారా, స్వామివారి కైంకర్యం శాస్త్రోక్తంగా నిర్వహింపబడుచున్నదా! చూసే అధికారం ఏకాంగిది. ఆలయంలో కైంకర్యసామగ్రి అంతా ఏకాంగి ద్వారా అర్చకులకు అందజేయడం జరుగుతుంది. అతను అందించిన సామగ్రితోనే ఆరాధన చేయడం అర్చకుల బాధ్యత. ఆలయంలో జరిగే ప్రతి సేవాకైంకర్యంలో ఈ మూడు వ్యవస్థల ప్రతినిధులు తప్పనిసరిగా ఉండేటట్లు కట్టుదిట్టమైన వ్యవస్థను రామానుజాచార్యులే ఏర్పాటు చేశారని చెప్పక తప్పదు. తర్వాతి కాలంలో అనంతాచార్యుల శిష్యుడైన ఒ బ్రహ్మచారి పండితునికి దీక్ష నిచ్చి త్రిదండ కాషాయాలు ధరింపజేసి 'విష్వక్సేన ఏకాంగి' లేదా 'సేనాపతి యతి' అని పేరు పెట్టి బాధ్యతలు అప్పగించారు. మొట్టమొదటి ఏకాంగి విష్వక్సేనయతిగా చెప్పబడింది.

శ్రీరామానుజాచార్యులు తన రెండవ తిరుమల యాత్రలో ఏకాంగి పని భారం అధికంగా ఉన్నట్లు గ్రహించారు. క్రీ.శ. 1052లో విష్వక్సేన ఏకాంగికి సన్యాసదీక్ష నిచ్చి శఠగోపయతీంద్రుడు'గా పేరుపెట్టి నియమ నిబంధనలు పాటించడానికి, వారి అధికారాలు, ఆదేశాలు, ఆలయాధికారులు పాటించేటట్లుగా యాదవరాజుచే ఒక శాసనం చేయించారు. అంతేగాక ఒకవేళ ఈశఠగోపులు అధికార దుర్వినియోగం చేయడం జరిగితే వారిని తొలగించి అర్హుడైన మరొకవ్యక్తిని నియమించేటట్లు కట్టుదిట్టం కూడా చేశారు. ఇంకా నలుగురు ఏకాంగులను నియమించి వారిని శఠగోపయతీంద్రుల వారి అధీనంలో పనిచేసేటట్లు ఏర్పాట్లు చేశారు.

ఈవిధంగా ఏకాంగి వ్యవస్థ యతీంద్రవ్యవస్థగా మారింది. ఈ శఠగోపులే తర్వాతికాలంలో జియ్యంగార్లుగా పిలువబడ్డారు. 'జీ' అనే సంస్కృతమూలమైన పదం తమిళంలో 'జీయర్' అయింది. తెలుగులో జియ్యంగార్ అయింది. జియ్యంగార్ జీయ్యర్ అంటే జయశీలుడు అని అర్థం. వైదిక ధర్మస్థాపనలో నిలిచి, తద్విరుద్ధమైన వాదనలను నిరసించడంలో జయశీలుడై ఉంటాడని అర్థం. సంప్రదాయనిష్ఠ, సంస్కృత, ద్రావిడ వేదాంతాలు అధ్యయనం, అధ్యాపనం, ఆచరణలో నిష్ణాతులై సన్యాసాశ్రమాన్ని స్వీకరించినవారినే జీయరు అంటారు. పూర్వం రాజులు ఒక్కొక్కరు ఒక్కో పద్ధతిలో ఆలయంలో పూజాకార్యక్రమాల విధానం అమలుచేయగా రామానుజాచార్యులు వీటిని ఒక క్రమ పద్ధతిలో నిర్వహించుటకు తోడ్పడ్డారు. వీరు పాంచరాత్రాగమ వైష్ణవ తెగకు చెందిన వారైనను, వైఖానస ఆగమమునకు చెందిన వైష్ణవ బ్రాహ్మణులను గౌరవించారు. స్వామివారి కైంకర్య బాధ్యతలను వైఖానస అర్చకులే నిర్వహించాలి. అర్చకులు నిర్వహించు పూజా కైంకర్యాలలో ఎలాంటి పొరపాట్లు జరుగకుండా పర్యవేక్షించడం జియ్యంగారు చేయాలి. ఈ జియ్యంగారు అంటే సన్యాసులుకారు. ఈపదవికి వచ్చే వరకు సంసార జీవితం గడిపినవారే. అయితే ఈ పదవిలోకి వచ్చిన క్షణం నుంచి వీరు సన్యాసి ధర్మాలను పాటించాలి. శ్రీవారి ఆలయం తలుపులు తెరవడం నుంచి రాత్రి ఏకాంత సేవ ముగిసే వరకు కార్యక్రమాలను దగ్గరుండి తానుగాని అసందర్భ పరిస్థితుల్లో తన తరఫున ఏకాంగిగానీ పర్యవేక్షించే బాధ్యతలు నిర్వహించాలి. శ్రీవారికి జరిపే నిత్యపూజలకు సంబంధించిన పుష్పమాలలు, ఇతర వాటిని జియ్యంగారు లేక వారి ప్రతినిధులే యామునోత్తరగది నుండి తెచ్చి దగ్గరుండి అర్చకులకు అందించాలి. పూజా విధానంలో ఎలాంటి లోపాలు లేకుండా బాధ్యతలు నిర్వహించాలి.



శ్రీరామానుజాచార్యులు తన 102వ ఏట చివరిసారిగా తిరుమల వచ్చినప్పుడు యాదవరాజు ద్వారా శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆదాయ ఖర్చు, ఆభరణాలు మొదలగు వాటి విషయంలో శఠగోపయతీంద్రునికి సంబంధం గల వ్యక్తులచేత ఒక పూచీకత్తు (జవాబుదారీ పత్రం) వ్రాయించేటట్లు నియమం చేయించారు. కాలక్రమంలో ఈ పూచీకతు అధికారం జియ్యంగార్ల నుండి అర్చకులకు మార్చబడింది. ఆలయాధికారులు ఆలయనిధుల నుండి జీతభత్యాలు తీసుకునేవారు. జియ్యంగార్లకు, అర్చకులకు స్వామివారికి చేసే నైవేద్యంలో భాగం ఇచ్చేవారు. ఆచార్య పురుషులకు తీర్థ ప్రసాదాలు గౌరవ సూచకంగా లభించేది. శఠగోప యతీంద్రుని (జియ్యంగారు) జీవనవిధి ఆదర్శంగా చేసి తిరుమల ఆలయం ముందున్న 'శ్రీబేడీ ఆంజనేయస్వామి గుడి పక్కనే నివాసం ఏర్పాటు చేశారు. దీన్నే జియ్యంగారి మఠం అని పిలువబడేది. ఈ మఠం బాధ్యత జియ్యంగారిదే. మఠంలో రాములవారిని ప్రతిష్ఠించి, రాములవారి నిత్య ఆరాధన చేసే నియమం పెట్టి, హనుమంతుని ముద్రగల ఉంగరం, హనుమంతుని ముద్ర గుర్తుగల శ్రీవారి ఆలయం తలుపు గడియ తెరిచేందుకు, మూసేందుకు తాళపుచెవి, హనుమంతుని ముద్రగల ఒక గంట, హనుమంతుని ముద్ర (చిత్రపటం) గల పరివ్రాజక ధ్వజం చిహ్నాలుగా చేసి స్వామివారి సన్నిధిలో సేనాపతి యతికి ఇచ్చారు. ఇప్పటికీ దేవాలయం తలుపులు రాత్రి మూసేటప్పుడు, బీగాలుకు జియ్యంగారి సీలువేసేది హనుమంతుని ముద్రగల అంగుళీయకంతోనే. గంట, జండా జియ్యంగారుయాత్ర చేసేటప్పుడు, మఠం విడిచి ఆలయానికి వచ్చి పోయేటప్పుడు ఉపయోగిస్తారు.

తిరుమల ఆలయంలో జియ్యర్ వ్యవస్థ కీలకమైంది. ఆ తొలి తీర్థం (బ్రహ్మతీర్థం) స్వీకరించేది జియ్యర్. ప్రతి నిత్యం జరిగే సుప్రభాతం, తోమాల, అర్చనాది సేవల తరువాత జరిగే శాత్తుమొర జియ్యర్ నేతృత్వంలో జరుగుతుంది. బ్రహ్మోత్సవం సహా అన్ని ఉత్సవాలకు దేవుడి ముందు జియ్యర్

బృందం ప్రబంధ పారాయణం చేస్తూ నడుస్తుంది. ప్రతిరోజూ దివ్య ప్రబంధం పాశురాలను పఠించి దేవుడిని కీర్తించే అరుదైన భాగ్యం ఈ పదవిలో ఉన్న జియ్యంగారికే దక్కుతుంది. ఈ జియ్యంగార్లు సన్యాసులు. తిరుమల ఆలయంతో పాటు, తిరుపతి గోవిందరాజస్వామి ఆలయ పర్యవేక్షణలోను బాధ్యత వహించాలి. ఆలయం తలుపులు తెరచినప్పటి నుండి, రాత్రి మూసేవరకూ రెండు ఆలయాల్లో దేవునికి నిత్యనైమిత్తిక సేవాసమయంలో జియ్యంగారు కానీ లేక ఆయన ప్రతినిధికానీ తప్పనిసరిగా ఉండాలి. ఆలయంలో శ్రీవారి కైంకర్యానికి అవసరమైన పూజాద్రవ్యాలు / వస్తువులు అర్చకులకు అందించే బాధ్యత జియ్యంగారు ఏకాంగిది. వారందించిన దాంతో అర్చకులు వారి సమక్షంలోనే ఆరాధన చేయాలి. తోమాలసేవకు జియ్యంగారు / ఏకాంగి యామునోత్తురై అరనుండి బాజాభజంత్రీలతో పూలమాలలు గంపను తలపై పెట్టుకొని సంప్రదాయ రీతిలో తెచ్చి అర్చకులకు అందించాలి. శ్రీ వేంకటేశ్వరస్వామికి భక్తులు, రాజులు, రాజ్యాధికారులు, ధనికులు హుండీ ద్వారా కానీ, ప్రత్యక్షంగా కానీ, పరోక్షంగాకానీ ఇచ్చే కానుకలు, ఆభరణాలు, వస్తువులు, భూములు తదితరాలను ఏరోజుకారోజు ఆలయాధికారులు లెక్కలు తేల్చి మరుసటి రోజు ఉదయం జియ్యంగారికి అందజేయగా, ఆవివరాలు తోమాలసేవ తరువాత జరుగు కొలువు సమయంలో కొలువు శ్రీనివాసమూర్తి (బలిబేరము) పంచాంగ శ్రవణం, ఆలయంలో జరుగవలసిన ప్రత్యేక సేవల వివరాలు చెప్తాడు. తర్వాత జియ్యంగారి మఠం గుమస్తా క్రితంరోజు స్వామివారికి వచ్చిన ఆదాయం, కొప్పెర కానుక, సేవల ద్వారా వచ్చినవి వగైరా వివరాలు తెలియజేస్తాడు. ఆలయంలో జరిగే అనేకరకాల సేవలను జియ్యంగారు తాను, తన ఏకాంగులతో నిర్వహించడం కష్టంగా ఉంది. శ్రీవారి కైంకర్యంలో ఏ ఒక్కరోజూ అంతరాయం ఉండకూడదు. జియ్యంగారి పర్యవేక్షణలో లోపం లేకుండా పూజాకార్యక్రమాలు నిర్వహించడం తప్పక పాటించాలని



యాదవరాజు తన రాజశాసనం చేయించారు. కనుక జియ్యంగారు తనకు అప్పగించిన బాధ్యతలు, హక్కులు ఉల్లంఘించరాదు. ఇద్దరు జియ్యంగార్లు ఉంటే పెద్దజియ్యంగారు మరణిస్తే, చిన్నజియ్యంగారు వెంటనే పెద్ద జియ్యంగారై తమ బాధ్యతలకు ఏలాంటి ఆటకం లేకుండా విధులు నిర్వహించవచ్చు. తర్వాత అన్ని అర్హతలు కల్గి యోగ్యులైన వ్యక్తికి సన్యాసం ఇచ్చి చిన్నజియ్యర్ గా నియమించవచ్చు. ఈవిధంగా ఆలయ కైంకర్య సౌలభ్యం కోసమే ఇద్దరు జియ్యర్లు ఉండే సంప్రదాయం ఏర్పడింది.

పెద్దజియ్యంగార్ ఆరు మాసములు తిరుమలమీద, ఆరు మాసములు తిరుపతిలోని గోవిందరాజస్వామి ఆలయంలో ఉండి కైంకర్యం చేయాలి. చిన్న జియ్యంగార్ ఆరు మాసములు తిరుపతిలోను, ఆరు మాసములు తిరుమలలోను ఉండి ఊడిగం చేయాలి. అంటే పెద్దజియ్యంగారు తిరుమలలో ఉన్నప్పుడు, చిన్న జియ్యంగారు తిరుపతిలో ఉండి కైంకర్యం చేస్తారన్నమాట. నలుగురు ఏకాంగులలో తిరుమల మీద ఒక ఏకాంగి, తిరుపతిలో ఒక ఏకాంగి హాజరుండి ఒక నెల ఊడిగం చేయాలి. అనంతరం వారికి బదులు తక్కిన ఇద్దరు ఏకాంగులు సదరు ప్రకారం రెండు దేవాలయాల్లో ఊడిగం చేయాలి. ఈ విధంగా జియ్యంగారి సేవలు సర్వదా అందుబాటులో ఉండాలి. బ్రహ్మోత్సవానికి పెద్దజియ్యంగారు, చిన్న జియ్యంగారు, ముగ్గురు ఏకాంగులు తిరుమల మీద హాజరుండి ఊడిగం చేయాలి. ఒక ఏకాంగి గోవిందరాజస్వామి ఆలయంలో ఊడిగం చేయాలి. పెద్ద జియ్యంగారు, చిన్నజియ్యంగారు తిరుమలమీద ఉండి ఊడిగం చేయవలసిన కాలంలో హాజరుండక పోయినంతట ఏకాంగి పూజయొక్క పనికి ఆలస్యం కాకుండా ఊడిగం చేయాలి. ఈ పద్ధతి సంప్రదాయంగా వస్తున్నది. తిరుమలలో క్రీ.శ. 1052లో జియ్యంగారు వ్యవస్థ ఏర్పడినప్పటి నుండి క్రీ.శ. 2010 వరకు నలభై మూడు మంది పెద్ద జియ్యంగార్లుగా సేవలందించారు. ఇప్పుడు స్వామి వారికైంకర్యం చేస్తున్నది 44వ పెద్ద

జియ్యంగారు శ్రీశఠగోప రామానుజ పెద్ద జియ్యంగారు. క్రీ.శ. 2004లో 43వ పెద్దజియ్యంగారైన శ్రీరంగ రామానుజ పెద్దజియ్యర్ తిరుమల వేదపాఠశాలలో దివ్యప్రబంధ అధ్యాపకులుగా పనిచేసి పదవీ విరమణ పొందారు. తరువాత క్రీ. శ. 2010లో 44వ శ్రీ శఠగోప రామానుజ పెద్ద జియ్యంగారు కూడా విద్యాభ్యాసం తిరుమల వేదపాఠశాలలో జరిగింది. వీరు కూడా నాలాయిర దివ్యప్రబంధం, సంస్కృతం, ఆంగ్లం, వేదాలను అభ్యసించి అదే వేద పాఠశాలలో అధ్యాపకులుగా పనిచేశారు.

శ్రీరామానుజుల కాలం నాటి శాసనాల ద్వారా ఆచార్యులు తిరుమల వేంకటేశ్వరునికి చేసిన సేవని గమనించినట్లైతే, శ్రీవారికి సేవకు తిరుమల క్షేత్రంలో పుష్పారామాలు చాలా విరివిగా వుండేవని శాసనాలు చెబుతున్నాయి. రామానుజులవారి పేరుతో, ఒక పూలతోట, సరస్సు వుండేవని,T.T. 236, 311, 340 నంబర్లుగల శాసనాలవల్ల తెలుస్తున్నది. శకసంవత్సరం 1889 నాటి T.T.10వ నంబరుగల శాసనం సంస్కృతభాషలో స్రగ్ధర వృత్తంలో వుంది. ఇది పవిత్రమైన జలాలతో గోవిందరాజ స్వామివారికి నిమజ్జనోత్సవం శ్రీ మద్రామానుజాచార్యులవారి సూచనల ప్రకారం జరిగిందని యీ వృత్తంలో పేర్కొన్నారు.

శక సంవత్సరం 1419లో తిరుమలలో శ్రీ వేంకటేశ్వర స్వామివారి ఆలయంలోను, తిరుపతి గోవిందరాజాలయంలోను, తిరుపతి రామాలయంలోను శ్రీమద్రామానుజాచార్యులవారి విగ్రహాలు ప్రతిష్ఠింపబడ్డాయి. గోవిందరాజ ఆలయంలో శ్రీ మద్రామానుజులవారి మూలవిగ్రహంతో పాటు ఉత్సవవిగ్రహం కూడా చాలా ప్రాచీన కాలం నుంచి ఉన్నట్టున్నూ, ఊరేగింపు సమయంలో ఈ ఉత్సవ విగ్రహాన్ని యితర విగ్రహాలతోపాటు తీసుకు వెళ్లేవారనినీ, G.T.144 నంబరు శాసనాధారాలవల్ల అవగతమౌతున్నది.



శకసంవత్సరం 1898లో శఠకోపదాసర్ నరసింహరాయ ముదలయ్యార్ అనే ఉదారుడైన భక్తుడు, పణం అనే పేరుగల 5,200, నాణేలను ఒక నిధిగా, ఏర్పరిచి దేవాదాయ భూముల యొక్క నీటి వసతి సౌకర్యాల్ని వృద్ధి చేసి, ఆ ఫలసాయంతో శ్రీవేంకటేశ్వరస్వామికిన్నీ, ఆ ప్రాంగణంలోనే వెలసిన శ్రీ మద్రామానుజుల విగ్రహానికిన్నీ అధ్యయనోత్సవం, వంటి పర్వ దినాలలో భోగరాగాదులను జరిపించడానికి ఏర్పాట్లు చేసేదని T.T. 200 నంబరుగల శాసనం ద్వారా తెలియుచున్నది.

కాలక్రమేణ అనేక మంది దాతలు, తిరుమల వేంకటేశ్వర స్వామి ప్రాంగణంలో వున్న శ్రీ మద్రామానుజులవారి విగ్రహానికీ, భోగరాగాదుల నిమిత్తం అనేక మాన్యాలు దానం చేసి ఇతరవసతులు కల్పించారు. 11వ శతాబ్దపు ఉత్తర భాగంలోను 12వ శతాబ్దపు పూర్వభాగంలోను వైష్ణవ సంప్రదాయం విశిష్టాద్వైతసిద్ధాంతం బహుళంగా ప్రచారంలోకి వచ్చాయి. వీటి ప్రభావం తిరుమల ప్రాంతంలోకూడా ప్రస్ఫుటంగా గోచరమాతుంది. విజయనగర సామ్రాజ్యాధిపతులలో అధికసంఖ్యాకులు వైష్ణవమతాన్ని ఆమోదించి, అనుసరించారు.

మాధవునిపైన, సోదర మానవుల పైన అపారమైన అనురాగాన్ని, ప్రేమను పెంచడమే ఈ సిద్ధాంతానికీ పునాదిరాయి. వీరి సిద్ధాంతం ప్రకారం యితరములైన దేవతల కంటె విష్ణువు గొప్పవాడు. ఆరాధ్యుడు. వైష్ణవం అనేది కేవలం బ్రాహ్మణులకు మాత్రమే పరిమితంకాదు. జాతి మత వివక్షతతో సంబంధం లేకుండా, ప్రతి స్త్రీకి పురుషుడికీకూడా మతంలో స్థానం వుంది. అంటే సర్వులు ఈ మతాన్ని అవలంబించి, కైవల్య ప్రాప్తి పొందడానికి అర్హత వుందని చెప్పిన ఆళ్వారులను, దైవసములుగా పరిగణించి వారిని దేవోపచారాలతో పూజించి, ఆరాధించడం మరొక విశిష్టతను శ్రీ మద్రామానుజులవారి ప్రోత్సాహం వల్లనే ఈ పద్ధతి ఆచరణలోకి వచ్చిందని

తెలుస్తున్నది. శ్రీవైష్ణవసిద్ధాంతాధ్యయనానికి, ప్రచారానికి, అనువుగా వుండేటట్టు కొన్ని మఠాలు స్థాపితమైనాయి. తిరుమలలోగల ఈ తిరుమలై యప్పిరాన్ మఠం యీకోవకు చెందినదని T.T. 88 శాసనంలో చెప్పబడింది. మతప్రవక్తగా ఆవిర్భవించిన శ్రీమద్రామానుజులవారికి దైవత్వాన్ని ఆపాదించడంతో ఆయనపై గల భక్తిభావాన్ని నిరూపించడానికి కొన్ని ధర్మసంస్థలకు రామానుజకూట్లు అనే నామధేయంతో వ్యవహరింపబడుతున్నాయి. సాలువనరసింహరాయలు మొట్టమొదటి రామానుజకూటాన్ని స్థాపించినట్టు G.T.8వనెంబరు శాసనంవల్ల తెలుస్తున్నది. ద్రావిడప్రబంధం ఆప్రాంతంలో గల సర్వులకు, అర్థమయ్యే తమిళభాషలో వుందిగనక ఎక్కువ మందిని ఆకర్షించింది. శ్రీమద్రామానుజాచార్యులవారు, ఆయనకు పూర్వం వుండే ఆళ్వారులు ప్రవచించిన ద్రావిడదివ్యప్రబంధాలలోని విశిష్టతను భద్రపరచడానికిన్నీ, దేవాలయంలో అర్చనవిధానాన్ని క్రమబద్ధం చెయ్యడానికిన్నీ, పాంచరాత్రాగమ సిద్ధాంతాన్ని బహుళ ప్రచారంలోకి తేవడానికిన్నీ ప్రత్యక్షంగాను, పరోక్షంగాను చేసిన కృషి అత్యంత గణనీయమైనది. అందుచేత ప్రముఖ మతప్రవక్తలైన శ్రీమద్రామానుజాచార్యులవారి ప్రభావం అతిప్రాచీనకాలం నుంచీ, తిరుమలలోను, ఆ పరిసరాలలోను ప్రస్ఫుటంగా గోచరమవుతున్నది.

* * *



## 6. బ్రహ్మోత్సవదేవుడు - సప్తగిరీశుడు

కలియుగంలో 'వేంకటాద్రి'గా ప్రసిద్ధి చెందిన ఈ దివ్యపర్వతమును రత్నాచలం, స్వర్ణాచలం, నారాయణాద్రి, వృషభాద్రి, గరుడాద్రి వంటి ఎన్నో పేర్లను ప్రాచీన వాఙ్మయం పేర్కొంది. కలియుగారంభములో శ్రీ వేంకటేశ్వర నామంతో శ్రీమహావిష్ణువు అర్చామూర్తిగా అవతరించాడని ఆగమోక్తి. ఆదికృతయుగంలో భాద్రపదమాసం, ఏకాదశి, సోమవారం నాడు వేంకటాద్రిపై శ్రీమన్నారాయణుడు తన లీలాస్వరూపాన్ని ఆవిర్భవింపజేశాడని భవిష్యోత్తరపురాణం చెబుతుంది. ధర్మోద్ధరణకు వైకుంఠవాసుని ప్రార్థించడానికి దేవతలు, ఋషులు ఈ పర్వతంపై వచ్చారని పురాణాలు చెబుతున్నాయి. అరుణఘనశిలావిగ్రహ రూపంలో ఆవిర్భవించిన జగన్మోహన మంగళమూర్తికి చతుర్ముఖ బ్రహ్మ ఉత్సవాలను ఏర్పాటు చేశాడని పురాణ వచనం. అందు బ్రహ్మోత్సవాల సంరంభం ఎంత వర్ణించినా తక్కువే. పురాణాల ప్రకారం సకలదేవతలు శ్రీనివాసుని బ్రహ్మోత్సవాలను ప్రత్యక్షంగా తిలకించడానికి తిరుమలగిరుల్లో వేంచేసి ఉంటారనేది ఐతిహ్యం. వేదం గరుడ స్వరూపం. వేదవేద్యుడు గరుడవాహనుడు. భూమిని ధరించే అనంతశక్తి, యోగిపరంగా కుండలిని పరమాత్మునిచే శక్తిమంతమై పనిజేస్తున్నదిగాన ఇది శేషవాహన పరమార్థం. సూర్య, చంద్ర మండలాలలోని ప్రకాశం పరమాత్ముడే. ప్రత్యణువు పరమాత్ముని చేతనే చైతన్యం పొందుతున్నది. కనుక 'సర్వం విష్ణుమయం' అనే పరమసత్యాన్ని చాటి చెప్పడానికే చతుర్ముఖ బ్రహ్మ బ్రహ్మోత్సవాలు ఏర్పాటుచేశారు. ఈ బ్రహ్మోత్సవాలు భాద్రపదమాసం–సౌరమాసం ప్రకారం కన్యామాసంలో బ్రహ్మ శ్రీవేంకటేశ్వరునికి ప్రథమంగా బ్రహ్మోత్సవాలు నిర్వహించినట్లు పురాణాలు, ఆగమాలు వచిస్తున్నాయి. పదిరోజులు నిర్వహింపబడే బ్రహ్మోత్సవాలలో స్వామివారు శేష, హంస, సింహ, గరుడ, హనుమంత, గజ, వంటి వివిధ ఊరేగుతూ తన వైభవాన్ని కనుల పండుగగా ప్రత్యక్షం

చేస్తాడు. ప్రకృతి పులకించిపోతుంది. ఈ వాహనాలన్నీ శ్రీవారి దివ్యత్వాన్ని తెలియజేయడానికి ఏర్పాటైనవి.

బహ్మమంటే పెద్దది అని, గొప్పది అని అర్థం. గొప్ప ఉత్సవం గనుక బ్రహ్మోత్సవం అని పిలువబడింది. తిరుమల క్షేత్రంవరకు ఆలోచిస్తే మొదట ఈ మహోత్సవాన్ని బ్రహ్మ స్వయంగా ముందుండి జరిపించాడు. గనుక బ్రహ్మోత్సవంగా వ్యవహరింపబడింది. ఈ ఉత్సవం తొమ్మిదిరోజులు జరుగుతుంది. బ్రహ్మోత్సవం తొలినుండి చివరి వరకు భక్తజనులకు బ్రహ్మానందదాయకాలు. ఈ బ్రహ్మోత్సవ రోజుల్లో తిరుమల శ్రీ వేంకటేశ్వరుడు శ్రీదేవి, భూదేవులలో వైఖానస ఆగమ శాస్త్రానుసారం ఆయా వాహనాలపై అధిష్ఠించి ఊరేగుతూ భక్తులకు దర్శనమిస్తాడు. ఈ ఉత్సవం వార్షికోత్సవం. దీనినే సాలకట్ల ఉత్సవంగా వ్యవహరిస్తారు. సాల్ అనేది హిందీ పదం. దీనికి సంవత్సరం అని అర్థం. కట్టడ అంటే నియమం. ఇది తెలుగు పదం. క్రీ.శ. 1843లో ఆలయ నిర్వహణ బాధ్యతలు మహంతులకు అప్పగించబడింది. వాళ్లు నిర్వహణ సౌలభ్యం కోసం వాళ్ల మరాఠిభాషలో సాలకట్ల, పేష్కారు, పారుపత్యందార్ వంటి కొన్ని పదాలు ప్రవేశపెట్టారు. సాలకట్ల బ్రహ్మోత్సవాలు ప్రతి సంవత్సరం కన్యామాసం (ఆశ్వయుజ) శ్రవణానక్షత్రంతో ముగిసే విధంగా తొమ్మిది రోజులు నిర్వహించడం నేటికీ ఆనవాయితీగా వస్తోంది. ఈ తొమ్మిది రోజులు మలయప్ప స్వామిగా పిలువబడే ఉత్సవమూర్తులు రోజుకో రూపంలో భక్తులకు సాక్షాత్కరిస్తూ అనేక సందేశాల్ని ఇస్తూ తన కరుణారస దృక్కులతో ఆనందపరవశుల్ని చేస్తాడు. సృష్టి, స్థితి, ప్రళయాదులు, చిదచిత్తులు తన అధీనంలో ఉంచుకున్న భగవంతుడు అందరికీ అందుబాటులో ఉండి సేవలందుకుంటున్నాడు. క్రీ.శ.2015వ సంవత్సరంలో బ్రహ్మోత్సవ సమయంలో, ఉత్సవర్ల ఊరేగింపులో, అత్యంత విశిష్టమైన గరుడసేవలో ఓ వింత సంఘటన జరిగింది. దేవాలయ ప్రధాన అర్చకుడు గరుడ వాహన



ప్రారంభంలో తన సెల్ ఫోన్ ద్వారా తీసిన ఫోటోలో గరుడిపై కొలువుదీరిన శ్రీమలయప్ప స్థానంలో శ్రీవారిని మరుగుపరుస్తూ, మహత్తరమైన కాంతి పుంజం ఒకటి కన్పించింది. దీని అర్థమును అన్వేషించటం అటుంచితే ఈ సంఘటన శ్రీవారి మహిమకు తార్కాణము అని భావించారు.

తిరుమల దేవాలయంలోని క్రీ.శ. 830 సంవత్సరానికి సంబంధించి తొలిశాసనంలో తిరుచానూరును గూర్చి తెలుపబడింది. పూర్వం తిరుచానూరులో ఒక దేవాలయం ఉండేదని, అందు వేంకటేశ్వర స్వామికి నిత్యపూజా విధులు జరిగేవని పేర్కొనబడింది. ఆ తిరువిలన్ కోయిల్లో ఉత్సవమూర్తి మాత్రం ఉండేది. ఆ మూర్తి తిరుమల వేంకటేశ్వరునికి ప్రతీకగా ఉండేదట. ఈ తిరువిలన్ కోయిల్ పల్లవుల, చోళుల, బాణరాజుల సేవలను పొందింది. ఆరోజుల్లో తిరుమల మూలమూర్తి దట్టమైన అరణ్య ప్రాంతంలో ఉండేవారు. సరియైన ఆలయ ప్రాకారాలు లేవు. ఉత్సవాదులు నిర్వహణకు వీధులుకూడా లేవు. యాత్రికులకు సురక్షిత వసతి సౌకర్యంలేదు. స్థానికులు లేరు. క్రూరమృగాలు, విషసర్పాలు సంచరించేవి. అట్టి పరిస్థితిలో నాటి రాజుల ఆదరణలో తిరుచానూరులో తిరువిలన్ కోయిల్ ఆవశ్యకత ఏర్పడినట్లు భావించబడుతున్నది. 'తిరుమల ఒళుగు' అనే బ్రహ్మోత్సవాన్ని ప్రారంభించి మిగిలిన ఉత్సవాలు, ఊరేగింపులు తిరుచానూరులో నిర్వహించి చివరిరోజు ధ్వజావరోహణం తిరుమలలో జరిపేవారట. అంటే ధ్వజారోహణ, అవరోహణాలు మాత్రమే తిరుమల ఆలయంలో నిర్వహింపబడేవి. మిగిలిన వాహన సేవలు తిరుచానూరులో జరిగేవి.

భగవద్రామానుజులు తిరుమలలోని అర్చామూర్తిని గురించి శైవ, వైష్ణవ వివాదం విని, దాన్ని పరిష్కరించుటకు తిరుమల చేరి అచ్చట ధ్రువమూర్తి సాక్షాత్తు వైకుంఠవాసుని ప్రతిరూపమని ప్రామాణికంగాను, హేతుబద్ధంగాను నిరూపించాడు. అప్పుడు తిరుమల వేంకటేశ్వర ప్రభువుకు జరుగు బ్రహ్మోత్సవ విధానం తెలుసుకొని ఈ ఉత్సవం ధ్వజారోహణం మొదలు ధ్వజావరోహణం

పదిరోజుల వరకు తిరుమలలోనే నిర్వహించేటట్లు ఏర్పాటుచేశాడు. నాలుగువైపుల వీధులు లేనందున ఆలయం ముందే ఉత్తర–దక్షిణ దిక్కులుగా వీధిని ఏర్పఱచి అందు ఉత్సవమూర్తిని అటు ఇటు ఊరేగించేవారు.

తిరుమల శ్రీవారికి వేయి సంవత్సరములకు పూర్వంనుండి నిత్యపూజలతోపాటు అనేక ఉత్సవాలు జరుగుతున్నాయి. ఈ తిరుమల క్షేత్రం కలియుగ వైకుంఠంగా ప్రసిద్ధి చెందింది. వేంకటేశ్వరుడు సాక్షాత్తు వేదస్వరూపుడు. సనాతన భారతీయతత్త్వానికి దివ్య సంకేతాలు తిరుమల ఆలయం. సామాజిక చైతన్యానికి, ఆధ్యాత్మిక స్ఫూర్తికి, మానవ సమైక్యతకు, భారతీయ సంస్కృతి సంప్రదాయాలకు ఈ దేవాలయం పునాది వంటిది. భగవంతునికి, భక్తునికి అనుసంధానకర్త భక్తి మాత్రమే. కనుకనే ఆలయంలో అనేక ఉత్సవాలు ప్రతినిత్యం నిర్వహింపబడుతున్నాయి. బ్రహ్మోత్సవాలు ఆలయంలో జరిగే అన్ని ఉత్సవాల్లోకి ప్రసిద్ధిని పొందాయని పురాణాలు పేర్కొంటున్నాయి. నేటికీ బ్రహ్మోత్సవాల్లో శ్రీమలయప్ప స్వామివారు నాలుగు మాడవీధులలో ఊరేగుతారు. బ్రహ్మ ఈ ఉత్సవాన్ని మొదట చేశారని చెప్పడానికి గుర్తుగా ఊరేగింపునకు ముందు బ్రహ్మరథం ఉంటుంది. బ్రహ్మ భృగుమహర్షి శాపానికి గురై సాకారాన్ని కోల్పోయి శూన్యరూపంలో ముందు నడుస్తూ ఉంటాడు. నిరాకారుడు కనుక వొట్టి రథం మాత్రమే కదులుతుంది. దీని అర్థం బ్రహ్మదేవుడు దగ్గరుండి బ్రహ్మోత్సవాలను నిర్వహిస్తున్నాడని విశ్వాసం. చారిత్రక ఆధారాల ప్రకారం పల్లవరాణి సామవై క్రీ.శ. 966లో మణవాళ పెరుమాళ్ అనబడే మూలమూర్తికి ప్రతినిధిగా అదే రూపంలో వెండి విగ్రహాన్ని సమర్పించి తిరుమలలో కన్యామాసంలో జరిగే బ్రహ్మోత్సవాల్లో ముందుగా ఈ విగ్రహాన్ని ఊరేగించడానికి ఏర్పాటుచేసింది. ఆతర్వాత తెలుగు పల్లవరాజు విజయగండ గోపాలదేవర్ క్రీ.శ. 1254 చైత్రమాసంలో బ్రహ్మోత్సవం ఏర్పాటుచేసి దానికి కావలసిన ఖర్చులకు సంబంధించి ఏర్పాట్లు చేశాడు. అదే సంవత్సరంలో ఫాల్గుణ మాసంలో



మూడవ రామరాజు సామంతుడు వీరనరసింగదేవుడు పంగుణి బ్రహ్మోత్సవం ఏర్పాటు చేశాడు. క్రీ.శ. 1328లో త్రిభువన చక్రవర్తి తిరువేంకటనాథ యాదవరాయలు ఆడితిరునాళ్ పేరుతో ఆషాఢమాసంలో బ్రహ్మోత్సవం నిర్వహించుటకు ఏర్పాటుచేసి దానికి కావలసిన ఖర్చులను ఏర్పాటు చేశాడు. క్రీ.శ. 1429 ఆశ్వయుజమాసంలో వీరప్రతాపదేవరాయలు క్రీ.శ. 1446లో మాశి తిరునాళ్ పేరుతో హరిహరరాయలు, క్రీ.శ. 1530లో అచ్యుతరాయ బ్రహ్మోత్సవం పేరుతో విజయనగర రాజ్యపతి అచ్యుతరాయలు, ఈవిధంగా 1583 నాటికి సుమారు పదకొండు బ్రహ్మోత్సవాలు సంవత్సరం పొడవునా జరుపబడేవి. అయితే ఈ బ్రహ్మోత్సవాలు ఎన్నిరోజులు పాటు నిర్వహింపబడేవో ఇదమిత్థంగా తెలియడంలేదు. ఆ రాజులు, రాజ్యాలు కాలాంతరంలో కలిసి పోవుటచే, వారు ఏర్పాటు చేసిన బ్రహ్మోత్సవాలు మధ్యలోనే నిలచిపోయాయి. కానీ, బ్రహ్మదేవుడు నిర్వహించినట్లు చెప్పబడిన బ్రహ్మోత్సవం మాత్రం నేటికీ కొనసాగుతున్నది. ఈ బ్రహ్మోత్సవం ప్రతి సంవత్సరం ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి శుద్ధ దశమి వరకు పది రోజులపాటు జరుగుతున్నాయి. ఒకవేళ అధికమాసం వస్తే భాద్రపదమాసంలో ఒక బ్రహ్మోత్సవం, ఆశ్వయుజమాసంలో మరొక బ్రహ్మోత్సవం నిర్వహిస్తారు. ఈ రెండు బ్రహ్మోత్సవాలకు తేడా పెద్దగా ఏమీ ఉండదు. వార్షిక బ్రహ్మోత్సవంలో ధ్వజారోహణం, ధ్వజావరోహణం ఉంటుంది. మహారథోత్సవంలో కొయ్యతేరును ఉపయోగిస్తారు. నవరాత్రి బ్రహ్మోత్సవాల్లో ధ్వజారోహణావరోహణాలు ఉండవు. టి.టి.డీ ఏర్పడిన 1933 తర్వాత మూడు వెండిరథాలు స్వామి సేవలో తరించాయి. ఎనిమిదవ రోజు కొయ్యతేరుకు బదులుగా వెండితేరును 1992 వరకు ఉదయం ఉపయోగించేవారు. నేడు దానికి బదులుగా స్వర్ణరథమును ఉపయోగిస్తున్నారు. ఈ నవరాత్రి బ్రహ్మోత్సవాలు మూడు సంవత్సరాలకు ఒకసారి వస్తుంది.

తిరుమల శ్రీవారి ఆలయానికి సంబంధించి లభించిన శాసనాల ఆధారం క్రీ.శ. 966 రోజుల్లో పురవీథులు ఉండే అవకాశం లేదని, తిరుమల శ్రీనివాసుడు మాత్రమే గర్భాలయంలో ఉండేవారని, అంతకంటే పెద్ద నిర్మాణాలు ఉండే అవకాశం లేదని తెలుస్తుంది. కానీ 966లో బ్రహ్మోత్సవాలు పదిరోజులపాటు నిర్వహింపబడేదట. అంకురార్పణతో ప్రారంభమై ఉదయం, సాయంత్రాల్లో రెండుసార్లు శ్రీవారిని ఊరేగిస్తూ పదోరోజున తీర్థవారి దినంగా వ్యవహరించేవారట. మూడు, నాలుగు శతాబ్దాల తరువాత తీర్థవారి దినాన్ని మరొకరోజు పొడిగించి విదయాత్ర పండుగను నిర్వహించారట. తిరుమలేశుని ఊరేగింపులో మొదట బంగారు తిరుచ్చివాహనం వినియోగించారట. తర్వాతి కాలంలో ఈ వాహనమే బ్రహ్మోత్సవాల్లో కూడా వినియోగించబడింది. క్రీ.శ. 1339లో శ్రీవారి ఉత్సవమూర్తులైన శ్రీదేవి, భూదేవి సమేత మలయప్ప స్వామి వారిని బ్రహ్మోత్సవాల్లో వినియోగించారు. ఉత్సవమూర్తిని మలైకునియనన్ పెరుమాళ్ అనే పేరుతో వ్యవహరించేవారు. మొదటిసారిగా వెండి శేష వాహనాన్ని క్రీ.శ.1614లో ప్రవేశపెట్టారు. తీర్థవారి దినాన ఉదయం వెండిశేషవాహనంపై శ్రీమలయప్పస్వామిని ఊరేగించారు. ఉత్సవాలకు ముందు శ్రీవారి ఆలయాన్ని వైదిక ఆచారాలతో శుద్ధి చేసేందుకు క్రీ.శ.1454 ప్రవేశపెట్టబడింది. దీన్నే 'కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం' అంటారు. ఈ కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం ప్రతి సంవత్సరం ఉగాది, ఆణివార ఆస్థానం, వైకుంఠ ఏకాదశి, బ్రహ్మోత్సవాలకు ముందు వచ్చే మంగళవారం రోజున నిర్వహిస్తారు. ఈ కార్యక్రమంలో కస్తూరి, పసుపు, చందనం, కుంకుమ, పచ్చకర్పూరం, శ్రీచూర్ణం, నామకోపు, కిచిలిగడ్డ తదితర సుగంధ ద్రవ్యాలతో కలిపిన పవిత్ర మిశ్రమాన్ని గర్భాలయంలోని మూలవిరాట్టుపై దుమ్ము, ధూళి పడకుండా మలైగుడారం (ప్రత్యేక పట్టు వస్త్రం) కప్పి ప్రోక్షణం చేస్తారు. అంతేగాక ఆలయ మహాద్వారం మొదలు, ప్రాకారాలు, గోడలు, పైకప్పు, పూజాసామగ్రి అన్ని వస్తువులు



శుభ్రంచేస్తారు. నేటికీ తిరుమల ఆలయంలో ఈ వైదిక ఆచారం కొనసాగుతోంది. క్రీ.శ.1538లో సూర్యప్రభ వాహనం, గజవాహనం ప్రారంభించగా, క్రీ.శ.1614 సింహవాహనం మొదలైంది. క్రీ.శ. 1625లో మట్లకుమార అనంతరాజు శ్రీవారికి బంగారు అశ్వవాహనాన్ని, వెండి గజ వాహనాన్ని, సమర భూపాలవాహనాన్ని బహూకరించాడు. ఈ వాహనాన్నే నేడు సర్వభూపాల వాహనంగా వ్యవహరింపబడుతున్నది. ఈ వాహనాలే గాక నేడు పెద్దశేష వాహనం, హంస వాహనం, ముత్యపుపందిరి వాహనం, కల్పవృక్ష వాహనం, గరుడవాహనం, హనుమంతవాహనం, చంద్రప్రభ వాహనాలు కూడా బ్రహ్మోత్సవాల్లో ఉపయోగించ బడుతున్నాయి. ఎనిమిదవ రోజు ఉదయం శ్రీవారికి రథోత్సవం నిర్వహింపబడుతుంది.

తిరుమల శ్రీవారి రథోత్సవం గూర్చి పురాణాలు మరోవిధంగా చెబుతున్నాయి. తిరుపతి పూర్వనామం శ్రీపదపురి తెలుగువారి కొండ దిగువనున్నది 'తిరుపతి' అని, కొండ పైభాగాన ఉన్నది ఎగువతిరుపతి అని వ్యవహరించేవారు. తమిళులు కొండ దిగువ భాగాన్ని తిరుప్పతి అని, కొండ పైభాగాన్ని తిరుమలై' అంటారు. మలై అంటే కొండ అని, తిరు అంటే మంగళవాచకం అని వారి భావం. పేయాళ్వార్ మొదట తన పాశు రాలలో తిరుండు అరువి పాయుం తిరుమలై అని పేర్కొన్నారు. దీని అర్థం చిరుపాయలను కలుపుకొని ప్రవహించే సెలయేర్లు, జలపాతములు గల తిరుమల. అట్టి తిరుమలలో నెలకొన్న స్వామిమాహాత్మ్యం పది పురాణాలలో వర్ణించబడింది. ప్రత్యేకించి భవిష్యోత్తరపురాణం, పద్మపురాణం, వరాహపురాణంలో తిరువేంగడ ప్రశస్తి, స్వామికి సంబంధించిన అనేక అంశాలు ఉన్నాయి. తిరుమలలో శ్రీవేంకటేశ్వరుడు అధివసించగా బ్రహ్మ వేంకటగిరి మీద విఖ్యాతినుండు మీకున్నతమైన 'రథోత్సవం' చేయవలెనని ప్రార్థించాడని, విశ్వకర్మ బంగారు, రత్నాలు కూర్చిన రథమును చేసి ఇచ్చాడని శ్రీవారి పరమభక్తురాలైన వెంగమాంబ వేంకటాచలమాహాత్మ్యంలో

వర్ణించింది. తిరుమలలో తొలి రథోత్సవం బ్రహ్మ జరిపించాడని చెప్పినదానికి ఆధారం పురాణాలుగానే భావించాలి లేదా వెంగమాంబ వర్ణనగానే అనుకోవాలి. తి.తి.దేవస్థాన శాసనాలలో క్రీ.శ. 1476లో శ్రీశఠగోప నరసింహమొదలియర్ ఈకైంకర్యం చేసినట్లుగా పేర్కొనబడింది. ఆ కాలం తర్వాతివాడైన తాళ్లపాక అన్నమాచార్య కీర్తనలలో రథోత్సవ వర్ణనలు కన్పిస్తున్నాయి.

మనం ఎంతచెప్పినా తిరుమలవాసుని గూర్చి చెప్పుకొనేది కొంచెమే అవుతుంది. శ్రీ వేంకటేశ్వరుడు ఆదిమధ్యాంత రహితుడు. సర్వసృష్టి ప్రదాత. సర్వలోకనాయకుడు. వేదప్రతిపాదకుడు. వేదవేద్యుడు. దేవాదిదేవుడు. సర్వోన్నతుడు. సర్వాభీష్ట ప్రదాయకుడు. సర్వరక్షకుడు. చరాచర జగత్తునకు సృష్టి, స్థితి, లయకారుడు. కలియుగ వైకుంఠమనే తిరుమలలో వెలసిన ఆదేవుని గోవిందా, వేంకటేశా, శ్రీనివాసా, బాలాజీ అన్న అనేక పేర్లతో పిలువబడుతూ అనేక విధాలుగా నిత్య, వార, పక్ష, నక్షత్ర, మాస, సాలకట్ల ఉత్సవాలు జరిపించుకుంటూ భక్తులను ఆనందింప జేస్తున్నాడు. వీటన్నింటిలోను స్వామివారికి ప్రతి సంవత్సరం జరిగే బ్రహ్మోత్సవాలకు సుదీర్ఘ చరిత్ర ఉందని చెప్పుకున్నాం. బ్రహ్మకడిగిన పాదంగా... బ్రహ్మదేవుడు చేసే మహోత్సవాన్నే 'బ్రహ్మోత్సవంగా' చెప్పబడింది. భక్తుల కొంగు బంగారమై కోరిన కోర్కెలు నెరవేర్చే కోనేటిరాయుని దివ్యధామమైన వార్షిక బ్రహ్మోత్సవాలకు శ్రీవారి తరపున ఆయన సర్వసైన్యాధ్యక్షుడు విష్వక్సేనుడు సమీక్షించే కార్యక్రమాన్నే అంకురార్పణ అంటారు. సాయంత్రం విష్వక్సేనులవారు సర్వాలంకార భూషితుడై నాలుగు మాడవీధులలో సంచరిస్తూ శ్రీవారి బ్రహ్మోత్సవాలకు చేసిన ఏర్పాట్లన్నిటిని పర్యవేక్షిస్తూ, ఆలయానికి నైఋతిదిశలోని వసంత మంటపంలో పుట్టమన్ను తీసుకొని ఆలయంలోని ప్రవేశిస్తారు. ఈ సందర్భంగా పాళికల్లో పుట్టమన్ను ఉంచి అందులో నవధాన్యాలు అంకురింపచేస్తారు. ఈ కార్యక్రమాన్ని 'అంకుర



ఆరోపణ' గా నిర్వహిస్తారు. దీనినే అంకురార్పణగా పేర్కొంటారు. ఆరోజు కార్యక్రమానికి సోముడు అంటే చంద్రుడు అధిపతి. శుక్లపక్ష చంద్రుడు దిన, దిన ప్రవర్ధమానమైన తరహాలోనే నవధాన్యాలు కూడా దినదినాభివృద్ధి చెందాలన్న ఉద్దేశంతో శుక్లపక్షంలోనే ఈ వేడుక జరుగుతుంది. ఆలయంలోని యాగశాలలో బ్రహ్మోత్సవాలు జరిగే తొమ్మిదిరోజులపాటు ఆగమశాస్త్రోక్తంగా హోమాలు నిర్వహింపబడతాయి. మరునాడు ధ్వజారోహణంతో శ్రీవారి వార్షిక బ్రహ్మోత్సవాల సంరంభం ప్రారంభమవుతుంది. ఆలయ ధ్వజస్తంభంపై గరుడధ్వజపటాన్ని ఎగురవేసి అష్టదిక్పాలకులు, సకల దేవతలను ఆహ్వానిస్తారు. ఈ ప్రక్రియయే ధ్వజారోహణం. ఆ వెంటనే శ్రీమలయప్పస్వామి శ్రీదేవి, భూదేవులతో బంగారు తిరుచ్చిలో వైభవముగా నాలుగుమాడ వీధులలో ఊరేగుతాడు. రాత్రికి పెద్ద శేషవాహనములో తిరువీధుల్లో విహరిస్తారు. రెండవరోజు ఉదయం చిన్నశేషవాహనం రాత్రి హంసవాహన సేవలు నిర్వహిస్తారు. ఆ తర్వాత వరుసగా ఉదయం, రాత్రి వేళల్లో సింహవాహనం, ముత్యపు పందిరి వాహనం, కల్పవృక్షవాహనం, సర్వభూపాలవాహనం, బంగారు పల్లకిలో మోహిని అవతారం, గరుడ వాహనం , హనుమంత వాహనం, సాయంత్రం స్వర్ణరథోత్సవం, రాత్రి గజవాహనం, సూర్యప్రభవాహనం, చంద్రప్రభవాహనం, మహారథోత్సవం, అశ్వవాహనం, చక్రస్నానం, బంగారు తిరుచ్చి వాహనం నిర్వహిస్తారు. ఈ ఉత్సవాలను పురస్కరించుకొని శ్రీవిల్లిపుత్తూర్ శ్రీఆండాల్ దేవాలయంలో ప్రత్యేకంగా తయారుచేసిన పూలమాలలను శ్రీవారి బ్రహ్మోత్సవంలో నాలుగో రోజున సమర్పించగా, వాటిని ఆ రాత్రికి మూలవర్లకు అలంకరించి మరునాడు మోహినీ అవతార వాహన సేవలోను, గరుడ వాహన సేవలోను వాడుతారు. మహారథోత్సవానికి ముందురోజు రథానికి బంగారు గొడుగు అమర్చుతారు. బ్రహ్మోత్సవం చివరి రోజున చక్రస్నానం శ్రీవారి పుష్కరిణిలో నిర్వహిస్తారు. ఆరోజు తెల్లవారుజామున శ్రీదేవి, భూదేవి సమేత మలయప్పస్వామి తిరుచ్చివాహనంపై ఊరేగుతూ వరాహస్వామి ఆలయం

వద్దకు చేరుకుంటారు. స్వామివారి వెంట మూలవిరాట్ అంశగా భావించే సుదర్శన చక్రత్తాళ్వార్ ని కూడా ఊరేగింపుగా తీసుకువస్తారు. ఉభయదేవేరుల సమేత మలయప్పస్వామికి వరాహస్వామి ఆలయ ఆవరణలో సుగంధ పరిమళ ద్రవ్యాలతో స్నపన తిరుమంజనం శాస్త్రోక్తంగా నిర్వహిస్తారు. తరువాత చక్రత్తాళ్వార్‌కు, వరాహస్వామి ఆలయం ముందే పుష్కరిణిలో పవిత్రస్నానాలు చేయిస్తారు. ఆసమయంలో భక్తులు స్నానమాచరిస్తారు. దీంతో బ్రహ్మోత్సవక్రతువు ముగుస్తుంది. తొమ్మిది రోజులపాటు కన్నుల పండుగగా సాగిన బ్రహ్మోత్సవం ముగియగా ఆ రోజు రాత్రి ధ్వజస్తంభంపై ఉన్న గరుత్మంతుని చిత్రపటాన్ని అవరోహణం చేస్తారు.

బ్రహ్మోత్సవ వేడుక రోజుల్లో తిరుమల కొండపై యథాశక్తి సేవ చేయటమో, దాన ధర్మాలు ఆచరించటమో, నామసంకీర్తన చేయడమో, కన్నులారా దర్శించుటమో చేయాలని, అప్పుడే భూలోకమున పుట్టిన మానవజన్మకు ముక్తి కలుగుతుందని పురాణాలు తెలుపుతున్నాయి. ఈవిధంగా అనేకానేకవిధాలుగా ఎన్నెన్నో మహాపాతకాలను దహించే దివ్యమైన పుణ్యక్షేత్రం కాబట్టి దీనికి వేంకటాచలం అనే ప్రసిద్ధమైన సార్థక నామధేయం ఏర్పడింది. ఆత్మస్వరూపుడైన పరమాత్మ ఏడుకొండలమీద ఉన్న వేంకటేశ్వరుడు. అతడే నారాయణుడు. నారములు అంటే జీవులు. వాటన్నిటికీ ఆధారభూతమైన స్వరూపుడు గనుకనే తానున్న ప్రదేశాన్ని నారాయణాద్రి అని పిలువబడింది. శ్రీవేంకటేశ్వర స్వామివారిని ఆనాటికే చక్రవర్తులు, రాజులు, సామంతులు, అధికారులు, మఠాధిపతులు, కవులు, గాయకులు, వ్యాపారస్థులు, ధనికులు దర్శించుకొని అనేక దానధర్మాలు చేసి ఆలయాభివృద్ధికి తోడ్పడ్డారు. కొందరు భక్తులు ఆలయ నిర్మాణ కైంకర్యాలకి దానాలు చేయగా, మరి కొందరు నిత్యపూజాదికాలకు, ఉత్సవవైభవాలకు, అన్నదానాలకు సహకరించారు. కాలాంతరంలో శ్రీనివాసునికి అనేక విధాలైన ఉత్సవాలతో పాటు ప్రసాదనైవేద్యాలు పెరుగుతూ వచ్చాయి. ప్రపంచంలో అత్యధిక ఆదాయం పొందుతున్న



దేవాలయంగా ప్రాచీనకాలం నుండి పరంపరానుగతంగా వస్తున్నది. అంతేగాక ఎందరో మహర్షులు, యోగులు, దేవతలు ఈ వేంకటాచల సానువులలో జంతురూపాలలో సంచరిస్తుంటారు. అందువల్లే ఈ క్షేత్రంలో జంతువుల, పక్షుల అరుపులే వేదసారమైన శ్రీహరి సంకీర్తనలు.

తిరుమల ఆలయం ఎంతటి మహిమాన్వితమైనదంటే తురుష్కుల కాలంనాటికే ఆలయ వార్షిక ఆదాయం రెండు లక్షలకు పైగా ఉండేది. మొదట ముస్లింల దృష్టి ఆలయం పై పడింది. సునాయాసంగా రెండు లక్షలు వస్తాయని తెలిసి కొండకు వెళ్ళి ఆలయం మీద దాడి చెయ్యాలని సంకల్పించారు. పైనున్నది వరాహస్వామి అని తెలిసి ముస్లింలకు కొంత ఏహ్యాభావం కల్గింది కూడా. ఆలయ నిర్వహణను వేలం వేయించి ప్రతి సంవత్సరం రెండు లక్షల రూపాయలు అందేటట్లు ఒప్పందం కుదుర్చుకున్నారు. ఈవిధంగా తిరుమలలో ఉత్సవాలకు ఎలాంటి ఆటంకం కలుగలేదు.

**ఫలశ్రుతి**

**వేంకటేశస్య మాహాత్మ్యం యస్య గేహే ఽవతిష్ఠతే**
**ఆయు రారోగ్య మైశ్వర్యం సోఽన్తే విష్ణుపదం లభేత్**

వేంకటేశ్వరమాహాత్మ్యము అనే గ్రంథము ఎవరి ఇంట్లో వుంటుందో వారి ఇంట్లో ఆయుష్షు, ఆరోగ్యము, ఐశ్వర్యము వుంటాయి. ఈ వేంకటేశ్వరుని మాహాత్మ్యము పఠించినట్లైతే వారికి విష్ణుపథము కలుగుతుందని ఈ శ్లోకం వివరిస్తుంది.

**రెఫరెన్స్**


1. విజయనగర శాసనాలు భాషా సాంస్కృతిక సాహిత్యాంశాలు, కె. విద్యావతి, తి.తి.దే. 1994.
2. తిరుమల శాసనాలు ఒక నివేదిక, సాధుసుబ్రమణ్య శాస్త్రి, తి.తి.దే. 1930.

3. History of Tirupati, T.K.T. Veera Raghavacharya Vol.I, T.T.D, 1998.
4. ఆముక్తమాల్యద, శ్రీకృష్ణదేవరాయలు, వావిళ్లప్రెస్, చెన్నపూరి, 1959.
5. మనుచరిత్ర, అల్లసాని పెద్దన, ఎమెస్కో, 2000.
6. ఆదిత్యపురాణము, శ్రీవేంకటేశ్వర ఆర్షధర్మట్రస్ట్, హైదరాబాదు, 1982.
7. మార్కండేయపురాణము, శ్రీవేంకటేశ్వర ఆర్షధర్మట్రస్ట్, హైదరాబాదు, 1982.
8. బ్రహ్మపురాణము, శ్రీవేంకటేశ్వర ఆర్షధర్మట్రస్ట్, హైదరాబాదు, 1986.
9. ఋగ్వేదసంహిత, తి.తి.దే, 1982.
10. భవిష్యోత్తరపురాణము, శ్రీవేంకటేశ్వర ఆర్షధర్మట్రస్ట్, హైదరాబాదు, 1986.

* * *